# ఈ నాటకమునందువచ్చు పాత్రలు.

---

పురుషులు:—

శ్రీరాముడు—సాకేతపురాధీశుడు.

భరతుడు
లక్ష్మణుడు } రాముని తమ్ములు.
శత్రుఘ్నుడు

వసిష్ఠుడు—రఘుకుల గురుడు.

భద్రుడు—గూఢచారి.

వాల్మీకి—ముని

జనకుడు—సీత తండ్రి.

గాలవుడు—ముని బాలుడు.

లవుడు
కుశుడు } రాముని కుమారులు.

ఆంజనేయులు—శ్రీరామభక్తుడు.

కరాళుడు—రాక్షసుడు (చాకలి.)

స్త్రీలు.

సీత—శ్రీరాముని భార్య.

ప్రియంవద—సీత చెలికత్తె

శూర్పణఖ—రాక్షసస్త్రీ (రజకి వేషము వేసిన చాకలిది.)



# లవకుశ నాటకము

## ప్రథమాంకము.

---

రంగము :—[అయోధ్యాపురము :—ప్రవేశము :—శూర్పణఖ]

శూర్ప—(తనలో) ఓహో! ఈనగరము నేడు చిత్రవిచిత్రగతుల నలంకరించినారు. ఏగృహమునఁజూచినను తోరణములే. ప్రతిగృహము ముందు కన్నులపండువుగా ముగ్గులుతీర్చినారు. పురంబున నేప్రక్కఁజూచినను మంగళవాద్యములే. ఓహో! ఏమి! ఈహరినామ సంకీర్తనములు! ఈ జనులగుంపు! ఈ వైభవమునకు, ఈ యలంకారమునకుఁ గారణమేమియోకదా! (ఆలోచించి) సరి. సరి. జ్ఞప్తికివచ్చినది. మా దైత్యకుల నాశనమునకు గారణమైన ఆసీత గర్భిణికదా-నే డామెకుగాజులు తొడిగింతురఁట! అందుకనే ఈ సందడి. ఆ సువాసినుల పరుగులు. వీరియబ్బసొమ్మంతయు నచ్చటదాచిపెట్టినట్లు పరుగులెత్తుచున్నారు. జనకమహారాజు కూడవచ్చి యుండుటచే మఱింత సందడిగనున్నది. (ఇంచుక యూరకుండి) అబ్బా! సీతపేరుజ్ఞాపకమునకువచ్చిన యొడలంతయు మండిపోవుచున్నది. మా అండఁజీకొంప ముంచినదే యిది. రామరావణ యుద్ధమున నెట్లో చావుతప్పించుకొని నేనును, కరాళుడును నీవలఁ బడితిమి. రాముఁడొనర్చిన ఈ ఘోరకృత్యమునకు దగినట్లు పగసాధింపక యున్నచో నాయాత్మకు శాంతికలుగదు. సీతారాముల రక్తముతో మారావణాదులకుఁ దర్పణ

ములు విడువక యున్నచో నాకానందము కలుగదు. (ఆలోచించి.) ఇందులకేమి యుపాయము. ఒక్కసారిగ పోయి సీతను గుటుక్కున మ్రింగుదునా! ఇది పట్టియూశవలదు. దండకారణ్యమున నిట్లు జేయ బోయి ముక్కు చెవులు గోలుపోయితిని. తత్పరాభవము సైపఁజాలక ఖరదూషణాదులను రామునిపైకి బంపితిని. అబ్బా! రాముని పరాక్రమము తలఁచిన గుండెలదరును. ఒక్కఁడే పదునాల్గువేల రక్కసులను నుక్కడగించెను. పోనిమ్ము, ఏ మాయనైన బన్నుద మన్న మా మాయల నెఱింగిన విభీషణుఁడు రామునివద్ద నున్నాఁడు. ఏమియు దోచకున్నది. (ఇంచుక యూరకుండి) కరాళుఁ డిచ్చటకు వచ్చి నన్ను గలిసికొందునని చెప్పినాడు. ఇంతవఱకును రాలేదేమో! (ఎదుటఁ జూచి) అదుగో! అనుకొన్నంతలోనే వచ్చుచున్నాఁడు.

(కరాళుఁడు—ప్రవేశించును)

కరా—(శూర్పణఖనుఁజూచి) ఏమిశూర్పణఖా! నాకొఱకే నిరీక్షించుచుంటివి కాబోలు!

శూర్ప—నీవుగాక మనపక్షమున నికనున్నవారెవరు? అందఱిని రాముని బొట్టకుఁబెట్టితిమి కదా!

కరా—అయిన దానింగూర్చి యిప్పుడు యోచించినందువలనఁ బ్రయోజనమేమి యున్నది. ముందుకర్తవ్యము చూడవలయును కదా!

శూర్ప—కర్తవ్యమా! నీ వేమియాలోచించితివి?

కరా—ఆలోచించుట కేమున్నది. హఠాత్తుగ రాముని మందిరప్రవేశ మొనర్చి-యాతనిని యంతమందించి-పిదప-సీతను జంపుటయే.

శూర్ప—ఓహోహో! నీ యుపాయమునకు సంతోషించితిని. ఇదివఱకు రామునిచేతిలోఁ జచ్చిన రక్కసులకన్న నీవెక్కువ పరాక్రమశాలివి కాబోలు! ఇటువంటి ప్రయత్నములనుగూర్చి గట్టిగా మాట్లాడకుము. ఈ ప్రక్కనెక్కడయిన హనుమంతుఁడున్నాడేమో! ఇప్పుడే నిన్నును నన్నునుగూడ యొక గ్రుద్దులో చంపఁగలఁడు.

కరా—ఏదో క్రొత్తపేరు చెప్పుచుంటివి. హనుమంతుడెవడు?

శూర్ప—హనుమంతునే మఱచితివా! అతని పేరు మనము శాశ్వతముగా హృదయములోపల స్థాపించుకొనునట్లు చేసినాడే. మన లంకకు జిచ్చుపెట్టిన ఆంజనేయులనే మఱచిపోయితివా?

కరా—ఆంజనేయుడా! ఇప్పుడిక్కడ నుండెనా యేమి? వాని తల్లికడుపు కాల. పేరుచెప్పిన గుండెలలోదడబఱులుదేరుచున్నది. శూర్ప ణఖా! వాడున్నచోట మనముండరాదు. చచ్చినవారు చావనే చచ్చినారు. వారికోసము మనము త్రిప్పలుపడనేల మొంగుకు? ఆపగను తీర్చుకొనుటకు మనమిప్పుడు ప్రయత్నించడమేల? ఇది యంతయు వృథాప్రయాసము. మున్ను సీతనుగూర్చి నీవుచేసిన ప్రయత్నములన్నియు యేమయినవి? వ్యర్థమైనవి. నిజముగా రామ రావణ యుద్ధము నీమూలముననే కలిగినది. కాబట్టి సీతారాముల పై బగదీర్చుకొనుమాట, ఆప్రయత్నము విడిచిపెట్టి యే యర ణ్యమునకోపోయి సుఖముగా కాలము గడుపుదము. ఇప్పుడు మనమేదియైన ప్రయత్నించినచో, దానివలన నపాయమునొంద మిన మనలను జూచువారెవ్వరును లేరు. నామాటవినుము.

శూర్ప—ఛీ! పిఱికిపందా! ఇదియా నీవునాకుఁ జేయునుపదేశము. రాక్ష సులమై జన్మించిన మనము మానవులను వంచింప లేముగా-నీబోటివారుండుటచేతనే రాక్షసకులమట్లు నాశన మందినది.

కరా—నీవు కోపమేగాని కార్యాకార్యము లెఱుంగవు. పోనిమ్ము. ఇ ప్పుడు నీయుద్యమ మేమిటి? రామునితోఁ బోరాడి యాతని వధింపవలయుననియా?

శూర్ప—అమ్మయ్యో! రామునితో యుద్ధమే [అనుబంధము—(1)]

కరా—మఱేమి? సీతను నొరులకుఁ దెలియకుండ నంతఃపురమునుండి యెత్తుకొని రావలయుననియా?

శూర్ప—అదియు మనకు శక్యముకాదు.

కరా—కాకున్న నికమార్గమేమున్నది?

శూర్ప—మన మెట్లయినను నిప్పుడు మోసమునె ప్రయోగింపవలయు. దానినిమించిన దారుణాస్త్రము మఱియొకటిలేదు. ఎట్లయినను సీతారాముల కెడబాపవలయును. ఇదియేనాకుఁదోచిన యూహ.

కరా—నీకుఁదోచిన యూహ బాగున్నది. కాని ఇందులకుఁదగిన విధము నాలోచించవలయును. తత్ప్రయత్నమున మనము సఫలీకృతమనో రథులము కావలయును.

శూర్ప—నేఁదలంచినమార్గమున మనముతప్పక జయమునవహింపఁ గలుగుదు మను ధైర్యము నాకుఁగలదు.

కరా—ఆయుపాయము నేను వినవచ్చునా?

శూర్ప—నీవు వినకుండనెట్లు? అది అపాయము లేని యుపాయము. మాయ వేషములు వేసి మనమొక చిన్ననాటక మాడవలయును.

కరా—అదియేదో త్వరగాఁజెప్పుము.

శూర్ప—మఱేమియును లేదు. నీవు రజకుని వేషము - నేను రజకి వేషము ధరింపవలయును.

కరా—అంతమాత్రముచే నగు పని యేమున్నది.

శూర్ప—పూర్తిగవినుము. ఆ వేషములతో మనము చాకలివీధినిఁగాపుర ముందము. వీలునుజూచి మనమొకవిషయమునుగూర్చి కలహము అదివినుము (చెవిలోజెప్పి) తెలిసినదా!

కరా—బాగున్నది. దీనితో సీతకొంప తప్పకుండ మునుగగలదు. ఇఁక ఆలస్యమెందులకు? మనమఱిగి తత్ప్రయత్నమున నుందము-రమ్ము

(ఇరువురు నిష్క్రమింతురు)

రంగము:—[ఉద్యానవనము:—సీతయుఁ చెలికత్తెయగు ప్రియంవదయు బ్రవేశించుచున్నారు]

సీత—చెలీ! నీవింత చిత్రకారిణివని యెన్నఁడుసు నెఱుంగనైతిని-ఏదేదీ! ఆపటము, మరలనొకసారిచూపుము.

ప్రియం—(పటమును చేతికిచ్చును)

సీత—(చూచి) కైకమ్మగారి వరంబులకారణమున వనవాసమున కరుగుచున్న నన్నును-రామలక్ష్మణులను నెంతచక్కఁగాఁ జిత్రించితివే నిశ్చయముగా నానాఁడు మేమిట్లేయుంటిమి. ప్రియంవదా!

తే. గీ. అఖిలసామంత రాజన్యు • లధికభక్తి
సంతతముఁగొల్వ ధరనేలు • చక్రవర్తి
విధికృతంబునఁ దాపస • వేషమూని
యడవులందునఁ జరియింప • నయ్యెఁగాదె ॥

ఏదీ! ఆ రెండవపటము:—

ప్రియం—అమ్మ! ఇదిగుహుఁడు మిమ్ములను గంగానది దాటించుట.

సీత—(చూచి) సఖీ! గుహునిరూపము నెంతసహజముగఁ జిత్రించితివే. గుహునిఁ గూర్చి నీతో నొకవిషయము చెప్పవలసియున్నది. గుహుఁడు నిశ్చయముగా సద్ధర్మహృద్గుహుఁడే. ఈతఁడు నాప్రాణేశ్వరుని యందుఁజూపినభక్తి యపారమైనది. అబ్బా! ఇవి యన్నియు నెప్పుడు చిత్రించితివే. నీకెంతయోపికే! అన్నియు నిప్పుడుచూచుటకుఁగాలము చాలదు. నెమ్మదిగా మందిరమున జూడవచ్చును. కాని నీకుడిహస్తములోనున్న యాపెద్దపటమును మాత్రము జూపింపుము.

ప్రియం—(పటమును చేతికిచ్చును)

సీత—(చూచి-భయమునటించి) అమ్మో! లోక విద్రావణుఁడగు రావణుఁడు ప్రియంవదా! ఈభయంకరరూపముజూచిన నాయొడలు కంప మెత్తుచున్నది. రమణీ! నన్నుఁబట్టుకొనుము. నిలువఁజాలను.

(శ్రీరాముఁడు తొందరగాఁ బ్రవేశించును.)

శ్రీరా—(కోపముతో)

మ॥ మును మత్కాంతను గైకొనన్ గపిబలం • బుల్గొల్వ నిశ్శంకతన్
వనరాశిన్ దరియించివచ్చి ఘనజ • న్యక్షోణిలో దేవతల్
మునులున్ మోదమునంద జంపియుంటిగదనిన్నున్ రావణా! క్రమ్మరన్
వనితన్ జేరఁగనెట్లు జాలితివి ద • ర్పంబూని నేఁడియ్యెడన్.

ఓరీ! దైత్యకులాధమా! నిలువుము. (తొందరగా నడిచి) ఏడీ! రావణుఁడు. జానకి యేకారణంబుననో రావణుని పేరుచ్చ రించి భయపడినది కాబోలు! (సీతను సమీపించి)

మ॥ దశదిగ్భాగముల్ ప్రతాపమహిమల్ • దట్టంబుగానిండ, న
ద్దశకంఠస్ఫుట పంక్తికంఠముల దైత్యశ్రేణి ఘోషిల్లఁగ
ర్కశభల్లంబులఁ జెండివైచితిఁగదా • రామామణీ యట్టిచో
దశకంఠుండెటువచ్చు గ్రమ్మరనిను • దాఁజేర నిచ్చోటికిన్.

రమణీ! —భయంబు విడువుము.

ప్రియం—(నిష్క్రమించును.)

సీత—నాధా! నీచేత సంహరింపఁబడిన దశకంఠుఁడెటకు మరల నెట్లు వచ్చును? ప్రియంవద పటమునఁ జిత్రించిన రావణునిఁజూచి భయముచే నట్లంటి.

శ్రీరా—అబలా! చిత్రపటమును జూచియే భయమునందితివా? ఆహా! ఎంతటి ధైర్యచిత్తవు. (ఇంచుక యూరకుండి) రమణీమణీ! ఎల్లెడల నల్లిబిల్లిగ నల్లుకొన్న పొదరిండ్లక్రిందనున్న మల్లెమొత్తములును, హృదయాహ్లాదకరంబులగు జాజులును, ఘుమ్ముఘుమ్మని కమ్మని తెమ్మెరలఁ జిమ్ము సంపెంగలును, మదనుని చేతినుండు ఖడ్గమును సానబట్టు పలకరాల్లోయనందగు గేదంగులును, మార్గాయాససంజనిత తృష్ణావిదారణ కారణంబులగు నారికేళంబులును, భూర్జకర్జూరపనస నింబాది వృక్షంబులును, విమలసలిలాసారపూరిత జలాశయంబులును, తజ్జలాశయంబుల తీరంబుల మత్స్యంబులఁ బట్టుటకై వేచి, దొంగ జపంబాచరించు బకంబులును, ముద్దుపలుకుల జిలుకుచు, నీయధరంబును దిలకించి బింబఫలంబని భ్రాంతిని నున్న శుకంబులును, జానకీదేవి కంఠరవముతో మాది సమానముఁ గాదని కుహూకుహూ ధ్వానములు సేయు పికంబులును, పురివిచ్చియాడుచు, తమనఖములచే సర్పంబులఁజీల్చి యొడసిపట్టు కేకి సముదయంబును, గలిగి ఈవనంబెంత రామణీయంబును బ్రకటించుచున్నదో కంటివా? (ఇంచుకయూర

కుండి) ఈ అశోకవృక్షము క్రింద నొక్కింతకాల మాసీనులమై యాప్రాంతమునుండి వచ్చుచున్న శీతలపరిమళ సుగంధయుక్త మందమలయానిల సౌఖ్యంబు నొక్కింత గందము.

[అనుబంధము. (2)]

సీత—నాథా ఆయశోకవృక్షము పేరు దలంపకుడు.

తే॥ గీ॥ క్రూరమతియై సురారి నన్ • గొంచుబోయి
దీనిక్రిందనె యుంచెను • గాన; దలంప
వలదు దీనినిఁ బ్రాణేశ • బలువిధముల
నిడుమలంబడియుంటి నీ • వెఱుగకుండె.

శ్రీరా—అందుకా! రమణీమణీ! నీయభిప్రాయమున నే నే కీభవింపను. ఏమనిన,

తే॥ గీ॥ క్రూరమతియాచు వాడు నిన్ • గొంచుబోయి
యుంచెబో దీని క్రిందనె • చంచలాక్షి
కన్నతల్లి విధమున నిన్ • గాచె యీయ
శోక భూజంబు నీకును • శుభములిచ్చి.

కావుననియ్యది నీకుపకారమే చేసెను. రమ్ము - (వృక్షము క్రిందకుబోయి ఆసీనులగుచున్నారు.

సీత—నాథా! తెచ్చిపెట్టిన సౌందర్యము సహజసౌందర్యముతో సమానము కాదు సుమా!

శ్రీరా—నిశ్చయమే. జానకీ - వనవాసమునకు మనమరిగినప్పుడు నీవు తిలకించిన మహారణ్య ప్రదేశములును, నాయాప్రదేశంబులందుండు సెలయేళ్లును నీయుద్యానవనముకన్న నీచిత్తమునకు బాగున్నవని తలంచెదను.

సీత—అది యంతయుఁ బ్రకృతిశోభ కాని- అబ్బా! అరణ్యము- రాక్షసులు- ఆపేరు దలంచుకొన్న గుండెలు పగులును. రాక్షసుల స్మరించినఁ జింత కలుగును.

శ్రీరా—మాటఁ దలఁచినంతనే భయమా!

మ॥ సతతంబున్ మునివర్యులున్ సురలు హా • ర్షంబందఁగా దైత్యసం
తతినిన్ ఘోరరణాంగణంబుల సము • ద్యద్దర్పమేపారఁగా
శితనారాచపరంపరల్ దునుముచున్ • స్వేచ్ఛన్ వినోదించునం
చితసాకేత పురాధినాథ గృహిణీ • చింతింప నీకేటికిన్.

(ఇంచుకయూరకుండి) తరుణీ! ప్రియంవదచే జరుపఁబడుచున్న చిత్రపట ప్రదర్శనమునకు నేనడ్డమువచ్చి నీ యుల్లాసమునకు భంగము కలిగించితినికదా!

సీత—ప్రాణేశ్వరా! ఎంతమాటఁ బలికితివి.

మ॥ ఘనునింజూడఁగనెంచు చాతకమునున్ • గాంక్షించు చక్రంబు చం
ద్రునిఁ జూడంగఁ జకోరకోరు; సుజన • స్తోమైక రక్షామణిన్
నిను, నామానసపక్షి సంతతమునన్ • వీక్షింపఁగావేచు,నో
మను వంశోత్తమవార్ధిచంద్ర యిటులం • బల్కంగ ధర్మంబొకో.

భవదీయ దివ్యమంగళ విగ్రహసందర్శనముకన్నఁ ప్రియంవదచేఁగావింపఁబడు చిత్రపటప్రదర్శన మెక్కువదియా! నిన్ను సందర్శింపని యాదినము నాకు నిశ్చయముగా దుర్దినము

శ్రీరా—తరుణీమణీ! నీమానసము నే నెఱుంగకుంటినా?

సీ॥ జనకు సత్యమునిల్ప • మునివేషమునుబూని,
నేను వనంబుల • కేగుచుండ
ననుఁబాయఁజాలక • ఘనభోగ భాగ్యముల్
విడనాడి ప్రేమ, నా • వెంటవచ్చి
మత్పాదసేవయే • మహితమోక్షప్రద
మంచుఁ జిత్తమున భా • వించి, లేమ!
పడరానియిడుములఁ • బడి సురవైరిచే
జెఱఁబెట్టగాఁబడి • చేరి యచట

తే॥ గీ॥ నధిక దుఃఖంబునంది య • హర్నిశలును
నన్నె భక్తి భజించుచు • నన్నుఁజూడ
దాల్చియుంటివి జీవముల్ • తనువునందు
దెలియకుంటినె నీమది • జలరుహాక్షి.

అట్టికష్టములన్నియు దీఱిపోయినవి
తే॥ గీ॥ మంచిరోజులు వచ్చెను • మగువ మిన్న
గర్భవతివై తివింక ని • క్ష్వాకువంశ
వర్ధనుండగు పుత్రుని • బడయఁగలవు
నీ యభీష్టంబు దెలుపు మీ • నీలవేణి.
ఈ సమయంబున నీకుఁగల కోర్కెఁ దెలుపుమని గురుజనంబులుగూడ నాకనుజ్ఞ నిచ్చియున్నారు.

సీత—శ్రీమన్నారాయణ స్వరూపుండవగు నీవు నాకు జీవితేశ్వరుండవైతివి. అట్టిచో నాకేకొఱంతలైన నుండునా? నిరంతరము భవత్కారుణావర్షము నాపై గురిపించుచుండుటయే చాలును. అయినను నాయందుఁ గరుణాంతరంగుఁడవై యడిగితివి కావున విన్నవించెదను. గంగాతీరముననున్న మునికుటీరంబుల కరిగి యందలి తాపసస్త్రీలను దర్శించి రావలయునను కోర్కె చిత్తమున జనించినది. కరుణించి సెలవొసంగినచో పోయివచ్చెదను.

(అనుబంధము 3)

శ్రీరా—రమణీ! ఇది యేమికోరిక.

(అనుబంధము. 4)

సీ॥ కంటకావృతమైన • కాననంబేగాని
యుద్యానవనములు • నొప్ప వచట
కడుభీతిఁగొల్పు మృ • గంబులేగాని
సేవలసేయు విరిబోండ్లు • వరల రచట
కడుసారభుజియింపఁ • గందదుంపలెగాని
యమితాన్న భక్ష్యంబు • లమర వచట
శయనింపఁ గఠినపా • షాణంబులేగాని
హంసతూలికాపాన్పు • లలర వచట
తే॥ గీ॥ అకట! ఇది యేడ మానిక • న్యకలఁజూడ
వాంఛజనియించు టేడ, ఓ • పద్మగంధి

వలదునీకిట్టి కార్యంబు • వలదు వలదు
కోరుమిఁక నెద్దియైనను • గోర్కెఁదీర్తు.

సీత—నాథా! ఈ యభీష్టమెన్ని దినములనుండియో చిత్తమున నడఁచుకొనియుండి, తగు సమయముజూచి నీతో విన్నవింపఁదలచియుంటిని. నేడు నాపుణ్యవిశేషమున నీయంత నీవేయడిగితివి. కావునఁ గరుణించి ఈనాచిన్నకోరికఁ దీర్పుఁడు. శ్రమయిచ్చినందులకు క్షమింపుఁడు.

శ్రీరా—రమణీ! నీకిట్టికోరిక యేలకలిగిన దాయని సంశయించుచున్నాను.

సీ॥ మొన మొన్న నేకదా • వనవాసమునువీడి
సాకేతమునుజేర • జాలినాము
మొన మొన్న నేకదా • భూరిదుఃఖాబ్ధిఁ ద
రించిసౌఖ్యంబుల • గాంచినాము
మొన మొన్న నేకదా • వనఫలంబులమాని
యిష్టాన్నభుక్తిని • నెసఁగినాము
మొన మొన్న నేకదా • జనపదంబునఁబడి
లలితమోదమునందఁ • గలిగినాము

తే॥ గీ॥ ఇంతలోనీకుఁగానన • ప్రాంతమందు
సంచరింపఁగజిత్త మేఁసరణిఁబట్టె
కఠినపాషాణకంటక • కాననంబు
సౌఖ్యమంచునుదలఁచితే • జలరుహాక్షి.

సీత—ప్రాణేశ్వరా! నన్నుమన్నింపుము. ఆగ్రహింపక నాయభీష్టము దీర్పుము. ఎంతప్రయత్నించినను నాచిత్త మీయుద్యమమునుండి మఱలుట లేదు.

(అనుబంధము. 5)

శ్రీరా—విదేహరాజతనయా! ఈ స్వల్పాభీష్టమున కింతగా వేడుకొనవలయునా? నీ కేవిధమయిన కీడరణ్యమునఁగలుగునో యను భయంబున నట్లంటిఁగాని మఱియొక కారణమునగాదు. వేలుఁజూచి కతిపయదినంబులలో భాగీరథీతీరారణ్య ప్రదేశమునకు

తాపసకన్యకా సందర్శనార్థమై నిన్నుబంపెదను. (దిక్కులుఁజూచి) సూర్యాస్తమయసమయ మాసన్నమగుచున్నది కావున మనము పోదమురమ్మా.

సీత—కృతార్థురాల నైతిని.

(ఇరువురును నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.



# లవకుశనాటకము

## ద్వితీయాంకము.

రంగము:—(అయోధ్య-సభామందిరము:—శ్రీరామ - భరత లక్ష్మణ శత్రుఘ్నులు - వసిష్ఠుఁడు - ప్రవేశించుచున్నారు)

భర—(శ్రీరామునిఁజూచి)అన్నయ్యా!ఇన్నాళ్లకు సాకేతపురసామ్రాజ్యలక్ష్మినీభుజాపీఠంబున నిలిచినది. నేనెంతయుఁ గృతార్థుఁడనైతిని నీవులేనియీపురంబున నేనుండనొల్లక,నీవనవాసకాలమంతయు నేను సంగ్రామమున నిలిచి, భవత్పాదుకాముఖంబున సమస్త రాజకార్యములను జక్కబెట్టుచువచ్చితిని.

వసి—ఉ॥ ఆయతబాహువిక్రమ స • మార్జితవంశపరంపరాగత
శ్రీయుతరాజ్యవైభవము • జెందితివిప్డు;సుధర్మరక్షణో
పాయవిదుండవౌచు నర•పాలకులెల్లరుభక్తిఁగొల్వ. దీ
ర్ఘాయురుపేతకీర్తి భువి • నందఱుమెచ్చఁగనేలురాఘవా.

ఉ॥ జాతిమతాదిభేదముల • సాంగముగా విడనాడియాత్మసం
జాతులరీతిఁబౌరులను • సాకుచు శిష్టజనావనంబు దు
ష్టాతతశిక్షణంబు వెల • యంగను రాజ్యమనేలుమయ్య. నీ
ఖ్యాతి ప్రశస్తమౌనుదిజ•గంబులయందున జానకీపతీ.

రామచంద్రా! చిరకాలము నుండియు, నేనిక్ష్వాకువంశగురుండనై యుంటఁజేసి, నీకిట్లు జెప్పసాహసించితినిగాని, భగవత్స్వరూపుండవగు నీకుఁదెలియని పరమధర్మము లేమున్నవి?

సీ॥ జనకాజ్ఞయనుపేర • మునివేషమునుఁబూని,
వనితాయుతంబుగ • వనులకరిగి
దైత్యబాధలుబాప • దండకాటవినుండు
ఖరదూషణాదుల • ధరణిఁగూల్చి
వాలిని నొకకోలఁ • గూలగాఁ జేసి, యా
భానుసుతునిపట్ట • భద్రుఁ జేసి
శాఖామృగశ్రేణి • సైన్యంబుగాఁ జేసి
శంకయింతయు లేక • జలధిదాటి
తే॥ గీ॥ భువనములు పదునాల్గు స • మ్మోదమంద
రావణుని రూపుమాపి వి • రాజిలి
నిజనగరమునకేతెంచి • ప్రజలుమెచ్చ
బట్టభద్రుండవైతివి • భవవిరామ !

శ్రీరా—గురువర్యా! ఇది యంతయుఁ దమయాశీర్వచన ప్రభావమే.
(తమ్ములనుజూచి) తమ్ములారా!

సీ॥ సకలమతాచార • సద్ధర్మములకెప్పుడు
భంగంబులేక, కా • పాడవలయు
ప్రజలబిడ్డలవోలె • భవ్యకరుణఁబూని
నిరతంబుఁజూచుచు • వరలవలయు
దేశద్రోహుల • దివ్యఖడ్గముచేత
ముక్కముక్కలుగాఁగ • చెక్కవలయు
తాపసుల్ చేసెడి • తపములు యజ్ఞముల్
సొంపుగా రక్షించు • చుండవలయు.
తే॥ గీ॥ బీదసాధుల యందున • ప్రేమగలిగి
వారిసేమంబు గాంచుచు • వరలవలయు
నట్లుజేయఁజూచిన వాడె • యవనిధవుడు
గాకయున్నఁ దన్నామంబు • గాల్పవలయు.

మనరాష్ట్రంబునఁగల భూసురులెల్లరు తపోయజ్ఞాది సత్కృత్యంబులఁ జేయుచు వాసిఁ గాంతురు కదా. క్షత్రియులు స్వకులాచారమును

దప్పక ధనుర్విద్యలయందు గుశలులై యుందురే. అక్షుద్ర భద్రతర శౌర్యైశ్వర్య సంపత్సముద్రులగు వైశ్యులు-ప్రజలను మోసముసేయక వ్యాపారమును సేయుచు, వారిలాభంబున నాల్గవపాలు మనకొసంగు చుండిరా! శూద్రులు సంపదాంధకారమున మునిగియుండక బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులయందు గౌరవముంచి వర్తించు చుండిరికదా! రాజ్యం బెల్ల సస్యసమృద్ధియై దనర్చుచుండునే. కఱువు, రోగములు, యకాలమర ణంబులు లేక పుడమి వర్ధిల్లుచున్నదే!

భర—అన్నయ్యా!

సీ॥ జనులెప్పుడు తమకులా • చారధర్మంబులు
దప్పక సుమతులై • తనరుచుండ్రి
కఱువుబాధలులేక • క్ష్మాతలంబున నున్న
ప్రజలెల్లవృద్ధి నిం • బడయుచుండ్రి
వర్షక్రమంబు దం • ప్పకరాష్ట్రమంతయు
సస్యసమృద్ధియై • చాలవెలుఁగు
మోసమింతయులేక • భూఁవర్తక మభి
వృద్ధినింగాంచుచు • వెలయుచుండు.
తే॥ గీ॥ రామరాజ్యమాచంద్రతా • రకము ధరణి
నలరెడుంగాక యంచును • నఖిలజనులు
మ్రొక్కుచుండ్రి దేవుళ్లకు • ముదముమీఱ
రమ్యగుణసాంద్ర శ్రీరఘు • రామచంద్ర.

లక్ష్మ—సీ॥ దీపించుచున్నావు • భూపాలకులు నీదు
పాదపీఠికిఁదలల్ • వంచిమ్రొక్క
పాలించుచున్నావు • ప్రజల బిడ్డలరీతి
ధర్మమార్గంతయు • దప్పకుండ
రక్షించుచున్నావు • "రాఘవా" యనుశర
ణార్థుల లోకంబు • హర్షమంద
దూలించు చున్నావు • దోర్బలంబున దైత్య
తతిని దానవులు మో • దంబునంద

తే॥ గీ॥ సకలవిషయంబులందు, య • శంబుగాంచి
నేల నేలుచు నుంటివి • నీవు; లోప
ముండునే యెట్టిదయిన భూ • మండలమున
రమ్యగుణమూర్తి శ్రీరఘు • రామమూర్తి.

శత్రు—అగ్రజా! రఘునందనా! మేము నీయాజ్ఞననుసరించి ప్రచ్ఛన్న వేషంబులనందందు జరించుచునే యుంటిమి. ఎవ్వనినోట నుండియు, భవత్పరిపాలితంబగు నీ ధరాచక్రమున నొకకొఱంతయున్న దను మాటవినంబడదయ్యె. ఎచ్చటఁజూచినను నిన్ను భగవంతునిగా దలంచి నుతించువారలే. ఏ ప్రక్కనఁ జూచినను రామరాజ్యమునఁజల్లగావర్ధిల్లుచుంటిమనిపలుకువారలే. రామచంద్రా! విద్యావృద్ధి,సస్యవృద్ధి, ధర్మవృద్ధి,ప్రజావృద్ధితో, మన రాజ్యము వర్ధిల్లుచున్నదని చెప్పుట కావంతయు సందియములేదు. మన రాజ్యమునఁ జారులు-చోరులు - అనాచారులు-సత్యవిదూరులు లేరు.

వసి—రఘునందనా! నీ పరిపాలనంబును గూర్చి నీవు సందియమునంద నవసరములేదు. నీవు సామాన్య మానవుడవుగావు. ధరాభారనివారణార్థమై దేవతాప్రార్థితుఁడవై యిట్లు సూర్యకులంబు పావనము సేయఁ బ్రాదుర్భవించిన నారాయణమూర్తివి "రామా" యని యొక్కమారు స్మరించినచో మానవులు తమపాపంబులను బాయుదురు. అట్టి మహనీయగుణాకరుఁడవగు నీవురాజ్యంబిరను బాలించుచుండగా నేవిధమయిన లోపమయిన గలుగునే? (ఇంచుక యూరకుండి) రామా! నేనుపోయివచ్చెదను. దేవతార్చనకు వేళయయినది.

శ్రీరా—చిత్తము

వసి—(నిష్క్రమించును).

శ్రీరా—తమ్ములారా! మీరిఁక మీమీ కార్యములందు వర్తింపఁజనుడు.

(భరత లక్ష్మణ శత్రుఘ్నులు - నిష్క్రమింతురు)

శ్రీరా—(తనలో) రాత్రి గూఢవేషమునఁ జరించి నగరంబున వార్తలారసి వచ్చుటకు నాచే నియోగింపఁబడిన భద్రుఁడింకను రాఁడేల! ఏమి కారణమో కాని నాచిత్తమున నదియొకవిధమైన కలత కలుగుచున్నది. ఎట్టి కష్టమైనవార్త వినవచ్చునో. సాధారణముగా ముందువచ్చు కీడును సూచించుటకు హృదయమున నారాటము ప్రవేశించుట మానవులయందు సహజము. (ఎదుటఁజూచి) అదుగో! భద్రుఁడు. ఈతని మొగము దినమువలెఁగాక కొంచెము కళఁబాసియున్నది. ఏదియో కష్టతరమైన వార్త వినియున్నవిధ మీతని మొగమే సూచించుచున్నది.

భద్రుఁడు—(ప్రవేశించి-తనలో)

తే॥ నగరవార్తల నారయ • నన్ను రాత్రి
రాముఁడేల పంపవలెను • రజకవీధి
కేల బోయితి; నచటవా • రేలవారు
సల్పవలె; నందుసీత ప్ర • శంసయేల.

అక్కటా! నేనిప్పుడేమిచేయుదును. దుర్భరమైన యీవార్త శ్రీరామచంద్రున కెట్లెఱిగింతును? తెలుపక యున్నచో విశ్వాసశూన్యుండనగుదునే. తెలిపినచో రాముని హృదయమున బరితాపము ప్రవేశపెట్టినవాడనగుదును. పరితాపమా! సామాన్య పరితాపమే కాదు. రవికుల భూజము కూకటివ్రేళ్ళతోఁ బెల్లగించినవాడనే యగుదును. అయ్యో! ఏమియుఁ దోచకయున్నది. (ఎదుటఁజూచి) అదే శ్రీరామమూర్తి! ఈతఁడు నారాకకే ప్రతీక్షించుచున్నాడు కాబోలు. (సమీపించి) మహారాజా! ఈసేవకుని వందనములఁ గైకొనుము.

(నమస్కరించును.)

శ్రీరా—భద్రా! వచ్చితివా! రాత్రియంతయు నగరమున గూఢవేషమునఁ జరించితివా!

భద్రు—రామాజ్ఞ కన్యథావర్తింతునా?

శ్రీరా—నీవు భక్తి విశ్వాసములు గలిగిన సేవకుండవని తలంచియే నిన్నట్టి కార్యమున నియోగించితిని. సాధారణముగా సేవకు

లలోఁ గొందఱు రాజు వినఁగూడని వాక్యంబులను వినిపించుటకు వెనుదీసి, వానిని బయలుపెట్టక యుందురు. అయ్యది వారిపట్ల గొప్ప లోపమేయగును. కాని, నీవట్టివాఁడవుగాక, కన్నది, విన్నది, నాకొకింతయు దాచకుండ వెలుపు నిష్కల్మష హృదయుండవగుట నాకు గోచరమె.

భద్రా—(తనలో) ఈమహానుభావుని వాక్యములందు శ్లేషార్థము స్ఫురించుచున్నది. రజక కలహమునుగూర్చి నాకంటె ముందుగనే యీతఁడు వినియుండెనాయేమి! నాచిత్తమున సంశయము కలుగుచున్నది ఈతఁడు వినియుండి నేను చెప్పక దాచితినేని రాజద్రోహశిక్షకుఁ బాత్రుఁడనగుదును (ప్రకాశముగా) దేవా! సాక్షాత్ శ్రీమన్నారాయణ స్వరూపుండగు శ్రీరాముఁడు మనలను బాలించుచున్నాడు. ఈతని పరిపాలనమున నెలకు మూడు వానలు గురియుచున్నవి. గోవులు పిదుకక నే క్షీరముల నొసంగుచున్నవి. పాడిపంటలు సమృద్ధిగనున్నవి. రామరాజ్య మాచంద్రార్క తారాగావనీశరధిస్థాయిగ వర్ధిల్లుగాక" యని ప్రతిమానవునినోటను వచ్చుచున్నది. జ్ఞానశూన్యులును, అధమకులజులును, సురాపానమత్తచిత్తులును, పనిపాటలులేక వాడలందు గూర్చుండి యనేక విధములఁ బలుకుచుందురు. ఆమాటలను మాత్రము మనము పాటింపఁబనిలేదు. మహారాజా! నీపరిపాలనమున నావంతయు లోటులేదు. ప్రజలందఱును సంతోషసాగరమున నోలలాడుచుండిరి.

శ్రీరా—భద్రా! నీవుచెప్పినమాటలు కొంతవఱకు నాకు సంతోషమునే కలిగించినవి. కాని, నీచులమాటలను మనము పాటింపఁబనిలేదని నీవుపల్కిన వాక్యములందు నాకుఁ గొంతసంశయము గలుగుచున్నది. అట్టిది నీవు నాకు వినిపించుటకుఁగూడ భయమందుచున్నావని తలంచుచున్నాను. మంచిదయినను గాకున్నను ప్రజల యభిప్రాయమును మనుజవిభుఁడెఱుంగవలయును. ప్రజలు నన్నుఁ గూర్చి యేమైనఁ జెప్పుకొనుచుందురుగాక. అట్టిది నీవు నాకుఁ

దప్పక వినిపించితీరవలయును. రాజ్యలక్ష్మిపరిపాలనాభారము మిగులకష్టము. ఎంతపుణ్యముతోడ బాలించినను నేదయిన కొఱంతకలుగుచునేయుండును. కావున - నీవేవో - నీచులమాట లంటివే- వానిని సంశయింపక చెప్పుము.

భద్రు—దేవా! నేను విన్నది రాజ్యసంబంధమయినవిషయముకాదు.

శ్రీరా—అట్లయిన స్వవిషయమనియే తలంచెదను.

భద్రు—నృపాలా! నీచులనోటినుండి వచ్చుపలుకులను నీవు వినరాదని నావిన్నపము, నన్ను క్షమింపుము.

శ్రీరా—భద్రా! ఇందలివిశేషము నీకుఁ దెలియదు. సత్యాసత్యములు హీనులనోటినుండియే వెలువడును. సజ్జనులువెలిబుచ్చుటకు సంశయింతురు. నీవేదియో నన్నుఁగూర్చియె వినియుందువు నాయొద్దఁ జెప్పుటకు సంశయింపక భయమువిడిచి చెప్పుము.

భద్రు—త్రాగుబోతులనుడులను మనము లక్ష్యముసేయరాదు. అట్టివి నీవంటిప్రభువునకు మేముచెప్పునవికావు.

శ్రీరా—భద్రా! నీవుపట్టిమాటలతోఁ గాలవిళంబనము సేయుచున్నావు నాకోపమునకు నీవుపాత్రుఁడవుగాక మునుపేచెప్పుము. నీకు భయములేదు. పరులనోటినుండివచ్చిన నుడులు వెలువరించుటకు నీవేల సంశయించెదవు? నేనేమైన నిన్ను శిక్షించెదనను భయమా! అట్టిదివలదు. నీకభయమిచ్చితి చెప్పుము.

భద్రు—(తనలో) ఇకజెప్పక తప్పదు. (ప్రకాశముగా) రామచంద్రా! నేను చాకలివీధిం జనుచుండ నొకగృహంబున రజకదంపతులు దేనికో కలహించు చుండిరి.

శ్రీరా—దానికేమి! ప్రతిగృహంబున నిట్టివికలవు. సంసారియెప్పుడును జింతాబ్ధిలోపలనె మునింగియుండును. వివాహమాడిన పిదప సంతానమునకై చింత. సౌఖ్యము గల్గకయున్నచింత. రోగము వచ్చినఁజింత. బంధుజనములు హెచ్చినఁజింత.ఇకభార్యాభర్తల కలహమా! చెప్పనక్కరలేదు. సాధారణముగా లోకముననున్న స్త్రీలు తమభర్తలంజేరి, తోడి నారీమణులకు గావలసిన భూష

ణములున్నవి, నాకు లేవని గుందుచుందురు. తనబంధువులువచ్చిన నెక్కువ గౌరవముతోఁ జూడలేదని కయ్యములాడుచుందురు. ఎక్కువ ధనమార్జింపలేదని దెప్పుచుందురు. స్త్రీలు సహజకోప స్వభావులగుటచే నేదియో నెపము గలిగించుకొని కలహించు చుందురు. తరువాత!

భద్రు—అక్కలహాకారణము నెఱుంగనుగాని, యారజకుఁడు తన భార్యనుగొట్టి యింటనుండి వెడలనడిపెను. వెడలగొట్టుటయే గాదు. నిన్నొల్లనని గట్టిగబలికెను.

శ్రీరా—పాపము! కాని, దానియందు వాడేమిలోపము గనిపెట్టెనో భగవంతు డెఱుంగవలయును. పదపడి,

భద్రు—అంతట నారజకి తమకులమునందున్న పెద్దలను తగవుదీర్పుమని కోరెను. వారందఱును చాకలివానింబిలిపించి, భార్యనేలుకొమ్మని గట్టిగ జెప్పిరి.

శ్రీరా—భార్యాభర్తల తగవుదీర్చి వారినొకటిగాఁజేయుట పుణ్యకార్య మేకదా! వారిమాటలపైన రజకుఁడు భార్యను గ్రహించెనా?

భద్రు—లేదు. లేదు కుక్కముట్టినకూటి కెవ్వ రాశపడుదురని వచించెను.

శ్రీరా—తనభార్యయందేదియో గొప్పలోపము వాడుగ్రహించి యిట్లు పలికియుండును. తరువాత-

భద్రు—త్రాగియుండిన వాడగుటచే నింకేవో కారులు ప్రేలినాడు. దేవా! అవి నీవు విననలసినవికావు. ఆలోచనకుఁ దేవలసినవి కావు.

శ్రీరా—భద్రా! సంశయించెదవేమి? తప్పక చెప్పుము.

భద్రు—(తనలో) తప్పించుకొనవలెనని యెంతప్రయత్నించినను వీలు కాదయ్యె. నేజెప్పుమాట సూర్యకులభూజమునకు మహాదావానలంబగును. ఏమిసేయుదును.

శ్రీరా—భద్రా! మాట్లాడవేమి? కాలహరణమునకు నా చిత్తము సైపదు.

భద్రు—మహాప్రభూ! ఏమని చెప్పుదును! రజకుఁడు భార్యను గ్రహించనని పలుక, కులమునందలి పెద్దలు వానితో "నీవు నీభార్య నేల వేని శ్రీరామచంద్రునితో జెప్పి నిన్ను దండింపజేయుదు" మని పలికిరి. అందులకు వాఁడు "శ్రీరామునితో జెప్పి నన్ను శిక్షింపజేయుదురా? తనతప్పు దానెఱుంగక నన్ను శిక్షించునా? రావణుని చే హరింపఁబడి యొకసంవత్సరము లంకయందుంచఁబడిన సీత నేలు వెఱ్ఱి రాముఁడను" గానని వాఁడు నిర్భయముగాఁబలికెను.

శ్రీరా—(పరితాపముతో) ఆహా!

భద్రు—(తనలో) ఈ మహాత్ముని హృదయమునఁ బరితాపమును బ్ర వేశపెట్టితిని. ఇయ్యది ముందెట్లు బరిణమించునో.

శ్రీరా—భద్రా! ఇక నీవు పొమ్ము.

భద్రు—(నిష్క్రమించును.)

(అనుబంధము 6.)

శ్రీరా—ఆహా! నాజీవయాత్ర నేటితో ముగియుటకే యిట్టిలోకాపవాద సంప్రాప్తించినది. లంకాపురంబున గన్నులారఁగాంచిన సీతా మహిళాలలామ పాతివ్రత్యపరీక్ష సత్యమని తలంతునా? సురాపాన మత్తచిత్తుఁడు- జ్ఞానశూన్యుఁడు - నీచకులసంభూతుఁడు - అగు రజకుడాడినపలుకు సత్యమని నమ్ముదునా! ఏమని భావింతును. ఏమని చిత్తమున ధైర్యము బాదుకొల్పుదును. ఈ యపవాద మహాగ్ని నాహృదయమునఁ బ్రవేశించి, హృదయమునే కాదు- ఆపాదమస్తకము- శరీరమంతయు దహించివేయుచున్నది. అడవులందు బెడిదంపుటిడుములఁ గుడిచిన యాయాసమంతయుఁదీఱ పురంబుఁ జేరితిమి. ఇక సౌఖ్యంబులఁ బొందవచ్చునని తలంచిన నా సంతోషమున కంతరాయము కలిగినది. జానకీ లక్ష్మణ యుతుండనై యరణ్యముల కేగుటం జేసి, సీతయుండుటచే యందుఁ బదునాల్గువత్సరములు వసించుట తృణప్రాయముగ భావించితిని. దండకారణ్యంబున నుండుకాలమున దండిశూరుండగు దైత్యాం డండజ యానంగొనిపోవుట సఱకుఁగొననైతిని. భీకర రణరంగ

మధ్యమున రావణుని శక్తిచేబడిన సౌమిత్రింగాంచి, విదారమన స్కుఁడనయ్యు, గ్రమ్మఱధైర్యమవలంబించితి. కాని, యిప్పుడునాశ్రవణరంధ్రంబులఁబ్రవేశించి, సర్వావయంబులు గాల్చివేయుచున్న రజక నిందావాక్య మహానలంబు జల్లార్చుటకు మార్గముగాన రాకయున్నది. పురంబు జేరితి నను సంతోషము - సౌఖ్యములఁ గాంతునను నుత్సాహము, హృదయమునుండి ధైర్యము, కన్నుల వెంట బాష్పములు ఒక్కసారిగ జారిపోవుచున్నవి. ఆహా! ఈరామునకు జగమంతయు నంధకార బంధురమైనట్లున్నది.

సీ॥ హాలాహలము మాడ్కి • నపనింద మదిఁజొచ్చి
కాయంబు సకలంబుఁ • గాల్చె నేడు
సాధ్వీలలామంబు • జానకి యనునట్టి
యగ్నిమాటల బద్ధ • మయ్యె నేడు
రాజన్యవరులలో • రాముడుత్తముఁడన్న
యమలకీర్తికి భంగ • మయ్యె నేడు
మార్తాండసద్వంశ • మహితయశోభూజ
మవనిపై ననుగూల • నయ్యె నేడు
తే॥ గీ॥ భవ్యధర్మంబు పెడదారిఁ • బట్టె నేడు
పరులు నవ్వన యెట్లు నాదు • బ్రదుకు నేఁడు
కటకటా యిక నేను లో • కంబునందు
నెట్లు దలమీదకెత్తి చ • రంతు నేడు:

అక్కటా! ఇప్పుడు నేనేమి సేయుదును! సంగరరంగమున లోక కంటకులయిన, భీకర దైత్యవీరుల కంఠంబులనఱికి, తద్రక్తమున నభ్యంగన కేళిసల్పిన యీకృపాణముచే, నాశిరమును ఖండించుకొని లోకాపవాదను బాయుదునుగాక. (ఆలోచించి) ఛీ! ఏమిపని చేయదలంచితిని! భుజబలపరాక్రమ శౌర్యములయందుఁద్రి భువనములలోఁ దనకు సాటిలేక చరించుచుండిన ఈ రాముడు,—పితృవాక్పరిపాలనార్థమై యరణ్యమునఁ బదునాల్గువర్షములు తాపసవేషమున జరించి పడరానియిడుమలంబడి, సత్యముచిల్పిన ఈరాముడు;—మోక్షసామ్రాజ్య సౌధంబునకు

మార్గమగు ధర్మమునకు నిలయమైన ఈరాముడు;—ఏమీ! ఆత్మహత్య
జేసికొనుటా! ఆత్మహత్యతో సమమైనపాపము మఱియొండు లేదుకదా!
అట్లొనర్చితినేని నాయాత్మ తిరుగవిముక్తిని బొందనటువంటి ఘోరనరక
కూపంబునఁ బడగలదు, నా పురుషార్థమునకు, నా శీలమునకు
నాధైర్యసాహసములకు, నావిజ్ఞానమునకు, భంగము కలుగును. ప్రపం
చము నన్నతి నీచదృష్టితోఁ జూచును. కావుననట్టి యకార్యమునకుఁ
గడంగరాదు. (ఇంచుక యూరకుండి) ఇట్టి యపవాద కలిగినందువలన
నాపాలిటికి మృత్యుస్వరూపిణియైనదనియు, భాస్కరవంశ సుప్రసిద్ధకీర్తికి
నాశన హేతువైన సీతను నానిశితఖడ్గంబున వధించి చిత్తశాంతినిఁ
బొందెదఁగాక, (ఆలోచించి) ఆ! ఏమి! ఎంత సాహసకార్యము! అయో
నిజమైన పరమపావనియని పేరొందిన సీత- రాజఋషియైన జనకభూపా
లుని హస్తంబులయందు ముద్దుగాఁ బెఱిగినసీత- ద్యుమణి వంశమణి
యైన దశరథ క్షితిపాలునకుఁ బెద్దకోడలై నాకర్ధాంగియైన సీత-జనకుని
సత్యశాసనంబు బాలింపనరణ్యములకేగు నన్ను విడనాడఁజాలక నావెంట
నరుదెంచి కష్టసుఖములు నాతో సమముగా పంచుకొనిన సీత నాసంతో
షమునకుఁ గారణమైన సీత-రావణునిచేఁ గొనిపోబడి, లంకయందొక్క
వత్సరము నిద్రాహారములులేక నన్ను దైవముఁ దలంచుచు, నామీద
ప్రాణంబులు నిలిపి మదాగమనము నిరీక్షించుచున్న సీత-అగ్నిహో
త్రునిచేత "సీత మహాసాధ్వి త్రిలోకపావని" యని జగంబులెల్ల మెచ్చ
సాక్ష్యమిప్పించిన సీత-హా! అట్టి సీతను? భువనవిఖ్యాతను- సుగుణసంఘా
తను, భూజాతను మదీయకృపాణంబునకెర సేయవలయునా? ఎంతదోష
ము! ఎంతదోషము! తోడునీడవలె జరించు భార్యనుజంపి మహాపాతక
మొకటిగట్టుకొందునా! ఇంక జేయవలసినదేమున్నది! ఆత్మహత్యఁ జేసికొని
ఘోరనరకంబునఁ గూలుదునా! అగ్నిహోత్రునిసాక్షిగఁ గైకొన్న
యర్ధాంగినిఁ జంపి దుర్యశంబందుదునా? సీత కారణమున గలిగిన యీ
యపనిందాగ్ని జ్వాలలయందు మ్రగ్గుచు, జీవంబుల భ[illegible]దునా
ఏమైనను నాప్రేయసినిఁ జేతులారఁ జంపఁజాలను. చంపక చేయున
దేమి! ఏదియును సేయకయున్నచో నాశరీరమెల్లను దహించివేయుచున్న

నిందామహానలజ్వాలలు చల్లారునెట్లు. పుట్టినింటికిం బంపిన బాగుండును, కాని, యట్లు సేయుటకేవిధమయిన నెపముగన్పించుట లేదు. ఇంతకును బుట్టినింటివారు పిలువనిదే పంపుటెట్లు. హా! రామచంద్రా! నీవెట్టియగాధవారాసియందు గూలితివి. నిందానివారణోపాయమునుగానక కొట్టుకొనుచుంటివే! సీతను బాయుటకు జంకుచుంటివా! నిందకన్న భార్యయందలి ప్రేమ యెక్కువదని భావించితివా! (ఇంచుక యాలోచించి) జ్ఞప్తికి వచ్చినది. సీతను బరిత్యజించెదనుగాక! భాగీరథీతీరపరిసరకుటీరంబులయందుండు తాపసపత్నులను సందర్శించివచ్చుటకు, బంపుమని నన్నడిగియున్నదికదా. కావున నక్కాంతను నానెపంబున, నరణ్యంబులందు డించిరమ్మనెదంగాక. హా రామచంద్రా! ఎంతక్రూరకార్యము జేయనెంచితివి! సుచరిత్ర - పరమపావని - నిష్కల్మషచిత్త - అగు నిల్లాలినినట్టడవికి బంపెదవా! ఎప్పుడును నిన్నెడబాయక నీపదసేవతప్పనన్యమెఱుంగని - సాధ్వి - సాధ్వియేకాదు. బ్రహ్మాదిదేవతలముందు అగ్నిహోత్రునిచే దనపాతివ్రత్యమునుగూర్చి సాక్ష్యమిప్పించిన నారీశిరోమణి - కాంతాజనచూళికాభరణ-అట్టిసీతనువిడిచెదవా! న్యాయాన్యాయవిచారణముతోం బనిలేదా! ధర్మముజూడవలదా! కట్టుకొన్న యిల్లాలును నట్టడవిం గట్టలం బట్టించె; ఛీ! ఈ రాముండెంతయవివేకి! ఎట్టికఠినహృదయుండు-అనిజనులు దూషింతురని యైనతలంపవా! (ఇంచుక యూరకుండి) ఇట్టివన్నియు నాలోచించినచో నిందాభరమువాయుట యెట్లు! హా జనకరాజపుత్రి! నాగృహలక్ష్మివగునిన్ను బరిత్యజించుచున్నాను. లోకాపవాదనివారణార్థము హృదయమునం గఠినత్వముజేర్చినాను. నాసంతోషము - నాసౌఖ్యము నాభోగము-నాసర్వస్వము నేటితో నశించినది. సువర్ణరత్నఖచితసౌధంబులందు సీతతో మృదుమధురసంభాషణంబున గాలముగడుపు సంతోషమంతరించినది. ఉద్యానవనారామములయందుసీతతో విహరించుసౌఖ్యము మాయమైపోయినది - గర్భవైతివని సంతసించుచు, నందనోదయభాగ్యంబున కెదురుచూచు నాకోరిక మాయమైనది నీవు సాధ్వీలలామంబవని నాకు సంపూర్తిగ దెలియును. కాని లోకాపవాదకు భీతిల్లి నిన్ను విడుచుచున్నాను. ఈ కపటచిత్తుని, ఈ కఠినహృదయుని, ఈ కులపాంసనుని,

ఈ దురితరతుని, నీపాతివ్రత్యప్రభావమునఁ జంపి పుణ్యము గట్టుకొనుము. సీతను విడిచిన ఈ రాముఁడు జీవింపఁడు. నాకై బెంగపడి మాతండ్రి యెట్లుమరణించెనో యట్లే నిన్నుఁ బరిత్యజించిన యనంతరము నేనుగూడ నగుదును-ఓప్రాణవాయువులారా! నిజకాంతను విడుచుచున్న నాశరీరము నుండి మీరు లేచి పొండు. ఓ! ఆకాశమా! ఒక్కపెట్టున నాతలపైఁబడి నన్ను నలిపివేయుము! ఓభూమీ! నన్ను నీలోగలుపుకొనుము- ఓసమస్త దేవతలారా! నన్ను జంపివేయుడు. ఓ! అగ్నిభట్టారకా! సమస్తదేవతల ముందు విదేహరాజతనయ మహాసాధ్వియని నీవుచెప్పినసాక్ష్యము నావ లక్ష్యద్రోసి-ద్రోసమనక-సీతను నడుకానకు బంపనున్న నన్నుదహించి వేయుము. ఓ కరుణారసమా! నన్ను విడిచిపొమ్ము-శృంగారరసమా! నీకును నాకును దూరమయినది-హా! సీతా! నిన్నుఁబరిత్యజించు చుంటిని-దుర్భరము-కష్టము-కష్టతరము-లోకనింద-సీతాపరిత్యాగము-హా! సీతా-సీతా-

(మూర్ఛిల్లును).

(అవనిక జారును).

రంగము శ్రీరాముని శయన మందిరము :—

శయ్యపై రాముఁడుండును. భరత లక్ష్మణ శత్రుఘ్నులు—ప్రవేశించు చున్నారు.)

భర—లక్ష్మణా! మనలఁజూచిన యంతనే మిగుల సంతోషముతో మాటలాడు అగ్రజుఁడు నేఁడేమికారణముననో మాటలాడక యున్నాఁడు.

లక్ష్మ—ఈతఁడేదియో దీర్ఘాలోచన తత్పరుఁడై యున్నట్లు దోచు చున్నది.

శత్రు—(పరికించి) ఇది సామాన్యాలోచనకాదు. విషాదముతో, గూడి నట్లు, నాకగుపించు చున్నది. కాకున్న మనలను ద్వరగా రమ్మనియేల యాజ్ఞాపించును.

భర—ఇదిమిథ్యమని మనమెట్లు నిర్ణయింపఁగలము. అగ్రజుని బ్రసన్నుని గాఁజేసికొందము. (శ్రీరాముని సమీపించి)అగ్రజా! రామచంద్రా! నీ తమ్ముల వందనముల స్వీకరింపుము.

శ్రీరా—(మాట్లాడక యుండును)

భర—అన్నయ్యా, పలుకవేమి! మాలోనెవ్వరమైన నీయెడల నపచారము గావించియుంటిమా! బుద్ధిపూర్వకముగ మేమట్టిది యెన్నఁడును జేసియుండము, ఒకవేళ విధికృతమునఁ బొరబాటున నట్టిదేదయినఁ జేసియుంటిమేని తెలుపుము. సవరించుకొందుము.

లక్ష్మ—అగ్రజా! నీవిచారమునకుఁ గారణము నేనూహింపఁ జాలకయున్నాను. సమస్త రాజ్య శ్రీలనువిడిచి యరణ్యమునకుఁ బోవునప్పుడైనను, నీముఖమున దీనభావమును సూచించి యెఱుఁగదు. ఈ విచారమునకుఁ గారణమేమి?

శత్రు—నేనేమయినఁ జేయరాని కార్యము జేసియుంటినా? మావలన నెట్టిలోపములున్నను నీవు క్షమింపవలయును నీవు మాకు అగ్రజుండవు గురుండవు, పిత్రుసముండవు. భగవంతుఁడవు, మమ్ము రక్షింపుము

శ్రీరా—తమ్ములారా! మీవలన నావంతయు లోపములేదు. కాని మీరు నాకొక మహోపకారము జేయవలసి యున్నది.

భర—అగ్రజా! మేము నీయెడల జేయుకార్యము మహోపకారమా? ఎంతమాటఁ బలికితివి. నీ తమ్ములు సర్వకాల సర్వావస్థలయందును నీయాజ్ఞకు బద్ధులని యెఱుంగుము. సంశయింపక నీతలంపును దెలుపుము.

శ్రీరా—మీలో నెవ్వరాకార్యమును జేసినను నాకుసంతోషమే.

భర—అన్నా? కార్యమానతిమ్ము.

శ్రీరా—తమ్ములారా? రేపుదయమున మీలో నెవ్వరైనను సీతను గంగాతీర ప్రాంతారణ్య మధ్యమున విడిచిరావలయును. ఇది రాజశాసనముగ శిరమునధరించి యట్లొనర్చుట కెవ్వరు సిద్ధపడుదురు?

భర—హా! రామచంద్రా! ఈ దారుణమైన యాజ్ఞయేమి! సీతనేమి? అరణ్యభూమిని విడిచివచ్చుటయేమి?

లక్ష్మ—జగన్మాతయగు సీతకీ యరణ్యావాస శిక్షయేమి? అగ్రజా?

చ॥ కలఁగనుచుంటివో యటుల • గాకను నీమతి తప్పెనో సుని!
శ్చలతరభక్తిఁ గొల్చు నను • జన్మలు వీరని నీవెఱుంగవో
కలనయినన్ నిర్మల విడువ • గా మదినెంచని సీతనా? వనం
బులకనుపంగ నెంచితివి • పోలునె నీకిది రాఘవాగ్ర ?

శత్రు—అన్నయ్యా? రామచంద్రా? కులపావనియగు సీతామహాదేవి నరణ్యముల కేల పంపఁదలంచితివి?

శ్రీరా—తమ్ములారా! మీరేమియు నాకుఁ బ్రత్యుత్తరము జెప్పవలదు. నేను సీతను బరిత్యజింపఁ దలంచితిని. నేఁ జెప్పిన చందమున మీరు చేయుదురా లేదా?

భర—అగ్రజా! మేము నీయాజ్ఞ ననుసరింపమని పలుక లేదు. పరిత్యజించుటకుఁ దగిన కారణము మేమెఱుంగగూడదా? ఇట్లు పలికినందుకు క్షమింపుము.

శ్రీ॥ తే॥ గీ॥ తమ్ముఁడా! అపనింద చి • త్తమ్ముఁ జొచ్చి
యగ్నికీలలరీతి గాయంబు నెల్ల
గాల్చుచుండెను నాకు, న • క్కారణమున
జింతయధిక మౌనంచును • జెప్పనైతి.

అంతకన్న మఱియొక కారణ మేమియు లేదు

భర—ఆ! ఏమి! రామరాజ్యమని ప్రజలు వేనోళ్ళ శ్లాఘింప ధరాచక్రంబు బాలించు చక్రవర్తివగు నీ కపనిందయా?

లక్ష్మ—అన్నయ్యా! నీ పలుకు వింతగనున్నది. బాల్యంబున రక్కసుల గెడపి కౌశికుని యజ్ఞరక్షణకర్తవైతివి. పదరజంబున జఱపి, పాషాణమైయున్న యహల్యశాపంబును వాపితివి. సకలక్షత్రకాంతార విచ్ఛేదకుండగు పరశురాముని గర్వంబును భంగపఱచితివి. వనవాస తాపసులభీతిఁ బాపవిరాధాది మృక్కడిరక్కసులనుక్కడగించితివి. భుజబలశాలియగు వాలిని నొకకోలనె గూలనేసితివి. లోకవిద్రావణుండగు రావణుని దునుమాడి సమస్తజగంబులఁ గాపాడితివి. అట్టినీకు దుర్యశమెట్లు వచ్చును?

శత్రు—అగ్రజా! భవత్పరిపాలిత బగు నీ వసుంధరయందు కొంచెత యేవంతయు లేక ప్రజలెల్ల సుఖించుచున్నారు. నిఖలరాజన్యులు-భక్తివిశ్వాసములుగలిగి నిన్ను సేవించుచున్నారు. సత్యరతుఁడవు. ధర్మమూర్తివి. ఆర్తత్రాణ పరాయణుండవు. జగన్నుతపరాక్రమమూర్తివి. భగవత్స్వరూపుఁడవు. నీకేమి! అపనింద యేమి?

శ్రీరా—తమ్ములారా! నేనసత్యము పలుకలేదు. మన నగరంబునఁ గల రజకుఁడొకఁడు భార్యతో గలహించుచుండ - పెద్దలువానికి దగుబుద్ధిఁజెప్పబోవ వాఁడు వారింగాంచి ఒక్కసంవత్సరము రావణునిచే లంకయందుంచబడిన సీతనేలుచున్న వెఱ్ఱిరాముఁడను గానని పలికెనఁట,

లక్ష్మ—ఆ దురాత్మా! ఎవ్వఁడవురా నీవు? ధర్మపథానువర్తియై బృందారకులుగూడ శ్లాఘింప నాత్మసంజాతుల చందంబున సర్వప్రజల సాకుచు, సజ్జనరక్షణము దుర్జనశిక్షణముగలిగి దిగంతరాక్రాంత యశఃపరిపూరితుఁడగుచున్న శ్రీరామచంద్ర ధరణీపాలుని నీగ తింబలికితివా! సుమిత్రాకుమార మహాక్రోధాగ్నినిఁ బ్రజ్వరిల్ల చేసితివి. ఇదిగో! నాకరవాలంబునకు నీశిరం బెరగా నిచ్చెదఁగాచుకొమ్ము. (ఖడ్గము సవరించుకొనుచున్నాఁడు)

భర—ఓరీ! నీచకులాధమా! సురాపానమత్తచిత్తుఁడవై యొడలెఱుంగక పూతచరిత్రయగు సీతమహాదేవి నీగతింబలికిన నీశిర్షముడొల్ల నేసెదఁగాక.

శత్రు—కండకావరంబున గండుమిగిలి జగన్మాతనిట్లు పలికిన నిన్ను ఓరీ! పాతకవర్తీ ఇదిగో - వచ్చుచుంటిని చంపుటకు.

శ్రీరా—తమ్ములారా! ఈయకారణ కోపమేమి! పామరుండగు రజకునిమీఁదనా మీశౌర్యముఁ జూపింపఁదలచితిరి. చాలుఁజాలు. శాంతింపుఁడు. మనము నోరుమూసికొనఁ గలముగాని లోకమును మూయఁగలమా! ఇకమీ రనవసరమగు సంభాషణతోఁ గాలహరణమొనర్పవలదు. నేజెప్పిన చందమునఁజేసి నాయశంబు గాపాడుడు. మీరునాకు దమ్ములును, సఖులును, ధనమును,

ప్రాణములునున్నై యున్నారు. భక్తివిశ్వాసములతో సేవించుచు నన్ను రాజ్యధారేయునిగాఁ జేసినారు, ఆకారణమునఁ బ్రతివిష యము మీతోఁ జెప్పవలసియున్నది. కావున నాయాజ్ఞను తత్క్ష ణము పాలింపుఁడు.

భర—అన్నయ్యా! ఈవెఱ్ఱియేమి! రవికుల భూజంబును బెల్లగించివేయ దలంచితివే! ఎవఁడో పామరుఁడాడిన వాక్యములఁ బాటింతువా! నిన్న మొన్ననుకదా వనవాసాయాస మా సాధ్వికి దీఱినది. ఇట్టి యుద్యమములు మానుమని చెప్పసాహసించినందులకు నన్ను మన్నింపుము. (అనుబంధము 7)

శత్రు—అగ్రజా! మాకుఁదల్లి - సర్వలోకములకు దల్లి. రవివంశమునకు లక్ష్మి, అక్కటా! ఆమెను వనంబులకుఁ బంపుదువా! సీత నగ రంబును విడిచె నేని సాకేతనగరంబునుండి లక్ష్మితొలగినట్లేకదా! సకలధర్మ సంవేదివగు నీవు ఎవ్వఁడో నీచుని పలుకుల నఱకుఁ గొని, అయ్యో! చిత్తమునఁ బరితాపము జేర్చుకొని, సాధ్వీలలామ నిట్లు జేయ నెంతువే! (అనుబంధము 8)

లక్ష్మ—

సీ॥ పరమపావని యన • ధర నయోనిజయౌచు,
నామె జన్మించుట • యరఁయ వేల
నీపాద సేవయే • నిఖిలపుణ్యములంచు,
నాత్మలో నెంచుట • యరయ వేల
నీమీఁద బెంగచే • నిద్రహారముమాని,
దనుజుని పురినుంట • దలఁప వేల
లోకైకసాధ్వి యీ • లోలాక్షియని యగ్ని
సొంపుగాఁ జెప్పుట • చూడ వేల
తే॥ గీ॥ కటకటా రాఘవా! యిట్లు • గరుణవిడచి
పామరుండాడు వాక్యముల్ • పాటిఁజేసి
జనకపుత్రిని ఘోరకా • ననములందు
విడువమందువా! న్యాయంబు • విడిచినీవు.

శ్రీరా—తమ్ములారా! మీరనవసరముగ నాకు ధర్మబోధ సేయవలదు. మీపాటి ధర్మములు నాకునుదెలియును. దుర్యశోనివారణార్థము సీతను పరిత్యజింపఁ దలంచితిని. ఇది ముమ్మాటికిని నిశ్చయము. మీరునాయందు భక్తిగలవారేని నాయాజ్ఞదీర్పుడు. భరతా!సంసిద్ధుఁడవై యుంటివా?

భర—అగ్రజా! ఈభరతుడు రాజ్యశ్రీలహరించి సీతాలక్ష్మణయుతంబుగా శ్రీరామచంద్రుని నరణ్యములకుఁ బంపెనని యిదివఱకే నానెత్తిపై నిందబడినది. ఇప్పుడు పూజ్యచరిత్రను భువనమాతను అక్కటా! సీతామహాదేవిని నరణ్యములందు విడిచివత్తునా? అట్టి దుష్కార్యమొనర్చిఈభరతుఁడు ప్రజలమొగమునుజూడఁగలఁడా? జీవముల ధరించి నిలుచునా! రాఘవేంద్రా! వలదు వలదు. ఇట్టి దారుణకృత్యము.

శ్రీరా—శత్రుఘ్నా! నీ నేమందువు?

శత్రు—(మాటలాడక యుండును.)

లక్ష్మ—అన్నయ్యా! రామచంద్రా! నేడు నీ వజ్ఞానసాగరంబునఁబడితివి. కాకున్న సీతనేమి! అరణ్యములకుఁ బంపుటేమి! సీతకు నీయందున్న భక్తి యనురాగము నేలతలంపవు. ఏ నారీశిరోరత్నమును గ్రహించుటకై నీవు హరుశరాసనము వంచితివి? ఏరామామణి నిమిత్తము నీవు క్రూరుఁడైన విరాధునిఁ గూల్చితివి? ఏకాంతకై వాలిం గూల్చితివి? ఏసాధ్వికై సాగరమును బంధించి లంక కరిగి లోకవిద్రావణుఁడగు రావణునిఁ బుత్రామాత్య భృత్యాదివర్గముతో భీకరసంగరమున వధించితివి? ఆమె సీతకదా! అట్టిసీత నాయరణ్యముల విడచుట. అగ్నిభట్టారకుని సాక్ష్యము నవలకు ద్రోసితివా? అనసూయాది మునిపత్నుల వాక్యములు పెడచెవినిబెట్టితివా? పామరుని వాక్యముల విశ్వసించి పూతచరిత్రయగు సీతయందు నిందారోపణ సేయుదువా? పాపము. పాపము. అమ్మానవతినిగూర్చి యిట్లుసంశయించిన మహాపాతకము వొడమును. అన్నయ్యా! నీవు పూర్వపు రాముఁడవుగావు.

న్యాయా న్యాయవిచారణపటిష్ఠత యేమూలదాచితివి? ధర్మ మును బరిత్యజించితివా? అకారణాగ్రహమును జిత్తమున జేర్చి తివి? సీతాపరిత్యాగమువలన నెన్నిపాపములు మెడకుఁజుట్టుకో నునో యాలోచింపవైతివి. గర్భవతియగు నపూర్వానినీ శిరో మణిని నడవుల పాలుఁజేసిన పాపమేకాదు. గర్భస్థసంతానము నకుఁ గూడ నెగ్గుఁజేసినవాడవే యగుదువు. రవికుల వినాశన మునకుఁ గారణుఁడ వయ్యెదవు. ఇక్కార్యము ముందువెనుక లాలోచింపక చేయుచుంటివి. పిదప విచారింతువు. ఇక్ష్వాకు వంశపావని - దశరథుని మన్ననఁగాంచిన కోడలు. సాకేత పుర సామ్రాజ్యలక్ష్మి.—మాసీతమ్మతల్లిని— అక్కటా! రామ చంద్రా! అడవులకుఁ బంపవలదు. వలదు.

శ్రీరా—(కోపముతో) లక్ష్మణా! నీవు నాకు బోధించుచుంటివా! (అం దఱిని నుద్దేశించి) ఇంతవఱకును మీరందఱు నాయందు భక్తి విశ్వాసములుగలిగి సేవించుచుండిరని తలంచితినిగాని విషపూరిత మధుఘటంబులని యెఱుంగనైతిని. ఛీ! మీముఖములుజూచినఁ బంచమహాపాతకములు సంభవించును. అర్థాంగిమూలమున నపవాద సంభవించినది. తమ్ములగు మీరు నాయాజ్ఞసేయక యుంటిరి. ఇక నేనిచ్చట నుండనేల? నాయిచ్చవచ్చిన లీలఁ బోయెద. (పోఁబోవును.)

(అను. 9.)

లక్ష్మ—(శ్రీరాముని పాదములపైబడి) అన్నయ్యా క్షమింపుము. సీతా మహాదేవియెడల నట్టిఘోరకృత్యము నొనర్పజాలక నీతో నేమే మో పలికితిని. క్షమింపుము.

శ్రీరా—లక్ష్మణా! ఇంకనీవు మారుపలికిన నాయాన. నీవు నాకెంత యుఁ గూర్చుభక్తుండవు. ఇక్కార్యభారమునీభుజస్కంధమునందు బెట్టుచుంటిని. సీతను నరణ్యములయందు విడిచిరమ్ము. ఆమె నెట్లు తోడ్కొనిపోవుదునాయని నీవు సంశయింపఁ బనిలేదు. ఆమె గంగాతీరముననున్న తపోవనంబులఁగాంచి, మునికన్యకల

సందర్శించి రాఁగోరికకలదని నాతో నుడివియున్నది. ఆమెను నీ వానెపంబున రేపు సూర్యోదయమున భాగీరథీతీరమున వాల్మీ కాశ్రమసమీపమున విడచిరమ్ము- పొమ్ము- ఇంక సీతకు రాముఁడు లేఁడు. రామునకు సీత లేదు. లక్ష్మణా - సంశయింపకుము. మనోవాక్కాయకర్మములయందు శ్రీరామునే నమ్మిన- సీతను - ఈ రాముఁడే పరిత్యజించుచున్నాఁడు. లోకమంతయు సీతని కంధకారమ్మైయున్నది. హా! దుర్యశము- తన్నివారణార్థము సీతను విడుచుట - లక్ష్మణా! నాకన్నులు తిరుగుచున్నవి. నే నిప్పు డెక్కడనుంటినో తెలియకున్నది. సీతా - సీతా -
(మూర్ఛిల్లును.) (అవనిక జాఱును.)

రంగము:—[సీతమందిరము:—ముందు లక్ష్మణుఁడు - విచారముతోఁ బ్రవేశించును.]

లక్ష్మ—(తనలో) సీతాపరిత్యాగము వలదని యెంత బోధించినను - ఎంత బ్రతిమాలినను - అగ్రజుం డొక్కింతయు వినఁడయ్యె. తుదకీ దుష్కార్యము సేయుటకు నాకాజ్ఞనిచ్చియున్నాఁడు. అక్కటా! ఈకార్యము నేనెట్లు సేయుదును. లోకము నిందింపదా! అగ్రజుని యాజ్ఞ దీర్చుటకన్న నాకు లోకనింద యెక్కువదియా! మున్ను రావణుని శక్తిచే రణంబున నీల్గక బ్రతికియుండుట సీతామహాదేవి నరణ్యంబులయందు విడిచి లోకనిందకుఁ బాలగుటకే కాబోలు! అక్కటా! నే నిప్పు డమ్మహాసాధ్వీశిరోరత్నమును- కఠినకాంతారమధ్యమున నెట్లువిడిచివత్తును? నిరంతరము నన్ను మాతల్లికంటె నెక్కుడుప్రేమతో నరసిరక్షించుచుండు తల్లి— సాధ్వియని బ్రహ్మాదిదేవతలముం దగ్నిహోత్రునిచే వినుతిగన్న సుగుణకల్పవల్లి - ఆసీతమ్మతల్లిని నెట్లు దోడ్కొని పోవుదును? దుర్భర శోకంబును బ్రకటింపకుండ లోనడంచుకొని యామె సన్నిధి కేగి "తల్లీ! నీ నాథుండు నీవుకోరిన కారణమున భాగీరథీ తీరారణ్యప్రదేశములకు, దోడ్కొనిపొమ్మని యాజ్ఞాపించె"నని పలికినంతనే యమాయకురాలగు నామె సంతోషించినదికాని,

తన ప్రయాణము రవికులనాశమునకుఁ గారణమగునని తెలియ దయ్యెను. (ఎదుటఁజూచి) అదిగో! ప్రజలలోనీవార్త ఇంతలోనె పడినదికాబోలు. అందుకని వారొకరితో నొకరు గుసగుస లాడుచున్నారు. పూతచరిత్రయగు సీత యరణ్యప్రయాణము మానవులకేగాక సమస్త జంతువులకును గూడ నిష్టము లేనట్లున్నది. సీతను గొనిపోవునప్పుడు రథంబు నడ్డగించుటకుఁ గాబోలు నినుపగొలుసులచే గట్టఁబడిన సామజంబులు గొలుసులనుఁ ద్రెంపుకొని తుండములు పైకెత్తి పరుగిడుచున్నవి. అశ్వములు తమశాలలయందుండి యీవలకు రాజాలక మేతలుమాని యదేపనిగ సకిలించుచున్నవి. గోవులు మేతలుడిగి, కన్నీరును విడుచుచు నేకదృష్టితో మాజానకీదేవి మందిరమువంకఁ జూచుచున్నవి. గోవత్సములు ప్రజలను మోదమంద సేయు తమగంతులనుమాని యంబారవముల జేయుచున్నవి. పంజరబద్ధములై యున్న శుకములు తమముద్దుపలుకుల మానియున్నవి. కేకిసముదయము పురివిచ్చి నాట్యములుసల్పుటమాని మూలమూలల నొదిగి యున్నవి. తుదకు మార్తాండుడుఁగూడ, జానకీ వనప్రయాణము తాను చూడఁజాలక మబ్బుచాటుననుండి, విధిలేక యిప్పుడిప్పుడే యాకాశవీధి నలంకరించుచున్నాడు.

సీ॥ పరిపూర్ణ గర్భిణి • పడతి మాజానకి
వని డించి వచ్చెదు • వాడనైతి
కఠినమౌ రామాజ్ఞఁ • గాదనఁజాలక
పాలింప వలసిన • వాడనైతి
సీతను నిటుజేసి • తే యను జననింద
భరయింపఁ జాలిన • వాడనైతి
బాంధవావళికెల్ల • బరమ దుఃఖముగూర్చి
పాపినై బఱగెడు • వాడనైతి
తే॥ గీ॥ భువన విఖ్యాతినింగాంచి • పొలుచుచున్న
ఈ రవికుల మహాభూజ • మెలమిఁద్రుంచి

శాశ్వతంబైన యపకీర్తిఁ • జాలఁగాంచి
ప్రాణములతోడ నిల్చెడి • వాఁడనైతి.

అదిగో నభోమణి యుదయించినాడు. ప్రయాణసంసిద్ధయై సీతా మహాదేవి యింకను రాదేమి! (ఎదుటఁజూచి) అదిగో!

(వస్త్రాభరణములతో సీత ప్రవేశము.)

సీత—వత్సా! రథము సిద్ధముగ నున్నదా! (ప్రిక్కనుజూచి) వాకిటికే నిరీక్షించుచుంటివి కాబోలు! మునికన్యకల కీయఁదలంచిన వస్త్రాభరణములు తీసికొనువచ్చుట కాలస్యమైనది.

లక్ష్మ—(తనలో) ఆహా! ఏమి! ఈమె వెఱ్ఱితనము. ముందువచ్చు హాని నెఱుంగక యీమె సంతసించుచున్నది. అయ్యో! ఇట్టితల్లిని నట్టడవినినెట్లు విడువగలను! ఓ! పరమ నిర్భాగ్యుఁడా! లక్ష్మణా! సాధ్వీమణియగుదల నెట్టి దుష్కార్యముఁ జేయుటకు సాహసించుచుంటివిరా! ఇది పాపకార్యమని నీయాత్మకుఁ దోచలేదా!

సీత—సౌమిత్రీ! ఆలోచించుచుంటివేమి! మన ప్రయాణమున కింకను కాలవ్యవధియున్నదా! రథము సిద్ధముగనే యున్నది కాబోలునే.

లక్ష్మ—సిద్ధముగనే యున్నది. రథంబెక్కవచ్చును. తల్లీ! రమ్ము.

సీత—లక్ష్మణా! మునికన్యకా సందర్శనమునకై వనప్రయాణమును గూర్చి సంశయించుచు, మీయగ్రజుఁడేమి యాగ్రహించునో యని భయమందుచు, నెట్టకేలకు సాహసించి యడిగితిని. అడిగినందుల కమ్మహానీయుఁడు నాముద్దు జెల్లించినాడు.

లక్ష్మ—(తనలో) ఈమెకు దుఃఖము గల్గుటకే యీముద్దు చెల్లింపఁబడినదని ఈమె గ్రహింపదయ్యెనుకదా!

సీత—లక్ష్మణా! మాట్లాడక యాలోచించుచుంటివేమి!

లక్ష్మ—అమ్మా! ఏమియులేదు. మార్తాండుఁడు తన యరుణకిరణ ప్రసారమును జాలించుచున్నాడు. ఇఁక మనము త్వరగా రథారోహణముసేయుట యుక్తము.

సీత—రమ్ము. (నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము.



# లవకుశ నాటకము

## తృతీయాంకము.

---

రంగము:—(అరణ్యమార్గము. రథముపై లక్ష్మణుఁడునుసీతయుఁ బ్రవేశము)

సీత—లక్ష్మణా! మనము గృహమునుండి బయలుదేరినది మొదలు మన కన్నియు దుశ్శకునంబులే యగుచున్నవి. అటఁజూడుము. పగటి పూటనే నక్షత్రములు రాలుచున్నవి. మధ్యాహ్నకాలమైనను మార్తాండుఁడు నభోమండలమునఁ బ్రకాశహీనుఁడై యున్నాడు. అమంగళంబును సూచించురవములతో సృగాలంబులు మన తేరును వెంటాడించుచున్నవి. రథధ్వజముపైఁ గద్దలాడుచున్నవి. నామనంబెందుచేతనోకలఁతనందుచున్నది,కలఁతయేకాదు. జగత్ప్ర ళయము సూచించునంత భయమొదవుచున్నది. మనము బయలు దేరిన ఘడియమంచిదికాదేమో! పోనిమ్ము. రథము నగరంబునకు మరల్చెదవా! మఱియొక సమయమున నరుదెంచి తాపసకన్యలను దర్శించెదఁగాక!

లక్ష్మ—(తనలో) ముందువచ్చుహానిని సూచించుట కట్టియపశకునములు కలిగి, చిత్తమున నాందోళన ప్రవేశపెట్టును. ఈయమ్మ యీ దుర్నిమిత్తంబులకు భయమంది, రథమును గృహమునకుమరల్పు మని నుడువుచున్నది. అయ్యో! రథంబును నగరంబునకెట్లు బోవనిత్తును. సీతను భీకరారణ్యములయందు విడిచిరమ్మనికదా శ్రీరామునియాజ్ఞ. కఠినచిత్తుండనై యీమె నింతవఱకుఁ జేర్చితిని.

ఇంక గంగదాటించి యావలనున్న ఘోరారణ్యమధ్యమున విడువ వలయును. అక్కటా! ఎట్లు విడువఁగలను? ఎట్లు శ్రీరాముని యాజ్ఞ యీమెకుఁ దెలుపుదును. (అను 10) (ఇంచుకయూరకుండి) ఎట్లయినను నీమెను మాటలతో మఱపించి నెమ్మదిగా గంగను దాటింపవలయును. (ప్రకాశముగా) అమ్మా! ఈయపశకునములతోఁ బని యధీరులకుఁగాని మనబోటి ధీరులకుగాదు. నీవు వీనింగూర్చి భయంబందవలదు. ఇది యరణ్య ప్రదేశమగుటచేత సృగాలారావములు మొదలగునవి మనకుఁ దోచుచుండును.

సీత—మఱది! నీవు చెప్పినమాట నిశ్చయమే, నిరంకుశశాసనుఁడగు శ్రీరామచంద్రభూపాలుని యనుజ్ఞఁబొంది, తాపసపత్నులకుఁ బ్రశస్త భూషణాంబరంబుల నొసంగఁబోవుచుంటిని. వెంటనున్నది జగద్వినుత పరాక్రమశాలివగు నీవు, అట్టిచో నాకు భయమేల. లక్ష్మణా! మనము ముందు వాల్మీకాశ్రమునకే పోవుదమా!

లక్ష్మ—తల్లీ! వాల్మీకాశ్రమమునకు మనము గంగదాటియావలకుఁ బోవలయును. అదిగో గంగ మనకు గనుచూపు మేరలోనేయున్నది. (రథము నడిపించును.)

సీత—వత్సా! రథము కొంచెము నెమ్మదిగా బోనిమ్ము. మార్గమంతయు నెత్తుపల్లములుగా నుండుటచేత కుదుపధికముగానున్నది.

లక్ష్మ—అమ్మా! నెమ్మదిగనే పోనిచ్చుచున్నాను.

సీత—లక్ష్మణా! ఏమికారణమోగాని చిత్తమున సంతాప మధికమగుచున్నది. అదియిట్టిదని చెప్పఁజాలకయున్నాను. కైకమ్మగారుమనకు నారవసనంబులఁ గట్టఁబెట్టి యరణ్యములకు బంపునప్పుడైనను, మాయాకురంగంబు మనలను వంచించి నన్ను నాత్మేశునకెడ బాపినప్పుడైనను, కుహనామునియై దశకంఠుడు నన్నుఁగొని పోవునప్పుడైనను, లంకాపురంబున నశోకవనంబున దైత్యకాంతలు నన్ను బాధించునప్పుడైనను, ఇట్టి చింత నేనెఱుంగను. ఈ మనోవికారమేమి! మార్గమున మనముచూచిన యాదుశ్శకునము లేమి! ఇదియంతయుజూడ నాకు దిగులుపుట్టుచున్నది. లోకమం

తయు నంధకారమైనట్లు దోచుచున్నది. ఈదుర్నిమిత్తములవలన నాప్రాణేశ్వరునకును అత్తలకును మఱదులకును మఱదండ్రకును నెట్టియాపదలు కలుగకుండుగాక!

లక్ష్మ—(తనలో) కష్టము. కష్టతరము-నిండుచూలాలగు నీమె నెట్లరణ్యమున విడుతును?

సీత—లక్ష్మణా! ఆలోచించుచుంటి వేమి!

లక్ష్మ—అమ్మా! ఏమియును లేదు. నేత్రపర్వం బొనర్చుచున్న గంగాస్రవంతిని సమీపించినాము. ఇక్కడరథము నాపుదును. జనకరాజపుత్రీ! ఈపావన భాగీరథీ సందర్శనమున నీమనోవైకల్యముతీరుగాక!

శా॥ రంగద్రాజముఖీమణీ యిదినదీ • రత్నంబు మందాకినీ
గంగాభోగవతీ సమాఖ్యలఁ ద్రిలో • కవ్యాప్తతంగాంచి, మేల్
పొంగారంగ నశేషభక్తజనులన్ • బూతంబుగావించునీ
గంగావాహినిఁ జూడుమాముదమునన్ • గల్యాణముల్ చేకుఱున్

సీత—దేవీ! భాగీరథీ! నమస్కారములు- (నమస్కరించి) లక్ష్మణా! ఈ దివ్యస్రవంతి రఘుకులదేవత యగుటంజేసి మనకు మఱింతపూజ్యురాలు.

లక్ష్మ—అమ్మా! రఘుకులదేవత యగుటచేతనేకాదు. జగత్కర్తయగు శ్రీమన్నారాయణుని పాదకమల మీమె జన్మగృహము. కైలాసవాసుని జటాజూటము శయనాగారము. సమస్తమునీంద్ర కృతయజ్ఞ తపోపవిత్రమైన యార్యావర్తము క్రీడాప్రదేశము. పరమపావనమైన యమునా తరంగిణి చెలికత్తె. సఖ్యమారత్నాకరుని తోడ- ఈమె పుణ్యము వర్ణనాతీతముకదా! (ఇంచుక యూరకుండి) తల్లీ! మాటలసందడిని ప్రొద్దెక్కుచున్నది. రథమాచెట్టుక్రిందనుంచి హయంబులను గట్టివైచి, మనము త్వరగా గంగదాటుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

రంగము:-(అరణ్యము.—లక్ష్మణుఁడు - సీత ప్రవేశించుచున్నారు.)

లక్ష్మ—(తనలో) ఇప్పటికి గమ్యస్థానమునకుఁ జేర్చితిని. హా! పరమేశ్వరా! సాధ్వీలలామయగు సీత నిట్లు ఘోరారణ్యము జేర్చిన నన్నెట్టినరక కూపమునఁ బడవేయుదువో కదా! ఇట్టి పాపకర్మ నకు నరకముగాక పుణ్యమా!

సీత—లక్ష్మణా! మనము మార్గము తప్పితిమేమో! చూడుము. ఈ సమీపమున మునియాశ్రమములున్న జాడ కానిపించుట లేదు. మార్గమంతయుఁ గఠినపాషాణ కంటకావృతమైయున్నది స్నానార్థమై గంగా తరంగిణికివచ్చు తాపసులుగాని, సమిత్కుశ ఫలార్థమై వనంబుల కరుదెంచు మునివటులుగాని, జలార్థమై వచ్చు తాపస కన్యకలుగాని కానిపింపక యున్నవారు. తాపసాశ్రమముల యందుండు గోవుల యంబారవములైనను విన వచ్చుట లేదు.

లక్ష్మ—(మాట్లాడక యుండును.)

సీత—మఱిదీ! మాట్లాడవేమి!

లక్ష్మ—(తనలో)

ఉ॥ కాననభూమిలోన నినుఁ • గ్రక్కున వీడుమటంచు, నాకు భూ
జాని యనుజ్ఞ నిచ్చెనని • సాధ్వికిఁ జెప్పుటయెట్లు? జెప్పినన్
మానిని రామునిందలఁచి • మానసమెల్లను గ్రీలనేడ్చుచున్
గాననభూమియం దకట • కాయమువాయునో! యేమిసేయుదునో.

చెప్పకుండ నేనెట్లు బోవుదును. (విచారించుచున్నాడు.)

సీత—లక్ష్మణా! అంధకారమయమైన యరణ్యమును మనము ప్రవేశించినాము.

లక్ష్మ—తల్లీ! అంధకారమయమైన యరణ్యమునందు మనము ప్రవేశించుటయే కాదు. మనమే యంధకారమునఁ మునిగిపోవు చున్నాము. (ఏడ్చును.)

సీత—లక్ష్మణా! అట్లు బలుకుచుంటివేమి! నీమాటలయొక్క యర్థము నేను గ్రహింపలేక యుంటిని. (పరికించి) అయ్యో! ఏమిది! నీమొగ

మింతలోనే నిశియందు బద్మమువలె మాఱిపోయినది. అదిగో! కన్నీరేల గార్చుచుంటివి. మఱదీ! కారణమేమొ చెప్పుమా! నాకుఁగూడ సంతాపము కలుగుచున్నది.

లక్ష్మ—(మాట్లాడక యుండును.)

సీత—నావాక్యములకుఁ బ్రత్యుత్తరమీయక యీతెఱంగున నంతకంత కధికదుఃఖ సముద్రమున మునిఁగిపోవుచున్నావేమి! ఎన్నఁడును నింత దుఃఖమును బొందియెఱుంగవే! ఇందులకుఁ దగిన కారణము నేనూహింపఁజాలక యున్నాను. అగ్రజుఁడగు శ్రీరామచంద్రుఁడేమైన నాగ్రహించెనేమోయని తలంతమన్న నీయందావంతయు నెపము కానఁబడదు. ఊర్మిళనీయందేమయినఁ బ్రతికూలమూహించె నందమా! వత్సా! మీది యనుకూలదాంపత్యము. నాయనా! అసత్యము లాడితివందునా! అదిగో! తారలు తమ గతులను దప్ప లేదు. యుద్ధమున వైరులకు వెన్నిచ్చితివందునా! చతుర్దశ భువనములయందును నిన్నుఁ దేఱిచూడగల వీరుఁడులేఁడు. ప్రజలు నీయందు గౌరవహీనులై యుండిరందునా! నీవర్తనమట్టిది కాదే. అక్కటా! ఇంత చింత నీకేల కలిగె.

లక్ష్మ—హా! రామచంద్రా! (విలపించును.)

సీత—కారణము జెప్పక యిట్లు విలపించెదవేల?

సీ॥ వరభాగ్య భోగముల్ • బాసిమీయన్నతో
నడవికి నేతెంచు • నప్పుడైన
మాయా కురంగంబు • మనల వంచింపఁగా
నన్నకై నిన్నంపు • నప్పుడైన
దర్పంబుబేర్చి నిర్ • దైత్యేశనందనుం
డాహవంబునఁ దాకి • నప్పుడైన
క్రోధంబు మీఱగా • గురుశక్తి నీపైన
నమరారి వేసిన • యప్పుడైన

తే॥ గీ॥ ఇంచుకంతయుఁ జింతించి • యెఱుఁగఁబట్టి
వాఁడ వయ్యయ్యో నేఁడిట్లు • వగచె దేల
చేయివెట్టి కలఁచినట్లు • లాయె మనసు
సేమమేకద యందఱు • చెప్పుమయ్య.

వత్సా! లక్ష్మణా! ఎంత దీనదశవచ్చినను ధైర్యము గోలుపోవు వాఁడవు గావు. నీవెవ్వరికిని గీడుఁజేసి యెఱుంగవు. పరభామ లన్న మాతృభావమునను, బరధనములన్న గరళము లెఱుంగు నను జాతువు అసత్యము వలుకవు. ధర్మము తప్పవు. శ్రీరామ పదారవింద ధ్యానముతప్ప నన్యమెఱుంగవు. సౌమిత్రీ! నాప్రాణేశ్వరుండగు శ్రీరామచంద్రమూర్తికి సేమమేకదా! నేను వచ్చునప్పుడమ్మహనీయగుణాకరుని దివ్యమంగళ విగ్రహసందర్శ నము జేయుటకుఁగొలువుకూటంబుననుండుటచేవీలు లేకపోయినది.

లక్ష్మ—అమ్మా! అందఱికిని సేమమే,

సీత—అట్లయిన నీకీ విచారమేల?

లక్ష్మ—(తనలో) అక్కటా! ఏమని చెప్పుదును-

సీత—వత్సా! మరలఁ బలుకవేమి!

లక్ష్మ—జనకరాజపుత్రీ! నిన్నీఘోరకాంతార భూమికిఁజేర్చి-జననిందిత కృత్యమొనర్చి మహాపాపము గట్టుకొనుట కీలక్ష్మణుఁడు సంసి ద్ధుఁడై యున్నాఁడనిచెప్పుట కెంతయు సాహసించు చున్నాఁడు-

(అను॥ 11)

సీత—(తొందరతో) ఏమీ! జననిందితకృత్యము జేయుటకు సాహసించి తివా! లక్ష్మణా! లక్ష్మణా! నీవు చేయఁదలంచిన పాపకార్యమే మి? నీయగ్రజుని యాజ్ఞననుసరించియే నన్నుదోడ్కొనివచ్చి తివికదా, అట్లయిన పాపకార్యమేమి. నీచిత్తము నిష్కల్మషమే కదా!

లక్ష్మ—లోకమాతా! నాచిత్తవృత్తి నీకు సంపూర్తిగాఁ దెలిసియుండియు నీవట్లు సంశయించెదవేల? అమ్మా! ఈలక్ష్మణుఁడు నీపాద సేవకుఁడగు పుత్రుఁడని యెఱుంగుము.

సీత—నాయనా! స్త్రీస్వభావమునఁ బలికినవలుకుల కాగ్రహింపకుండక నీపరితాపకారణము దెలిపి నాచిత్తమున శాంతిఁగూర్పుము-

(అను॥ 12)

లక్ష్మ—తల్లి. నీకు నేనుః శాంతిఁగూర్పఁగలవాడనుగాను, భగవంతుఁడే గూర్పవలయును,

మ॥ వనితా! దాచఁగనేల? రాఘవుఁడు పం॰ వన్నిన్ను నీఘోరకా
ననభూమిన్వడి జేర్చిరమ్మనుచుఁ ఖలునిన్ ॰ బాపాత్మునిన్ దుర్జనున్
జననిందాస్పదు ; గష్టమానసుని, ఈ ॰ సౌమిత్రినిన్ సత్కృపన్
గనుచున్ శాపమునిచ్చి చంపఁగదవే ॰ కల్యాణి! ప్రార్థించెదన్॥

(సీత పాదములపైఁబడును.)

సీత—(లక్ష్మణుని లేవనెత్తి) వత్సా! ఏమిది! నీచింతఁజూడ నాకుఁగూడ యాందోళన మధికమగుచున్నది. శ్రీరామచంద్రునియాజ్ఞ ననుసరించియేకదా తాపసపత్నీ సందర్శనార్థమై నన్నిట్లు దోడ్కొని వచ్చితివి. ఇఁకఁ జింతయేల?

లక్ష్మ—(చింతించుచు),

సీ॥ కంటకావృతమైన ॰ కాననశ్రేణియే
మందిరంబుల! నీకు ॰ సుందరాంగి
కడుభీతిఁ నొదవించు ॰ కానన మృగములే
పనికత్తెలా నీకు ॰ బద్మగంధి
యలదీర్ఘతర జంబు ॰ కారావములె నీకు
వీణారవంబులా ॰ విద్రుమోష్ఠి
కడుపార భక్షింప ॰ గందదుంపలె నీకు
నిష్టమృష్టాన్నమా ॰ యిగురుబోడి
తే॥ గీ॥ కఠినపాషాణముల్ చంద్ర ॰ కాంతశిలల
ముండ్లడొంకలు విహరించు ॰ భూరివనుల
కటకటా నీకునెట్టి సం ॰ కటముకలిగె
హా! జనకభూమిధవ పుత్రి ॰ అమలగాత్రి ॥

సీత—వత్సా! నన్ను జేరోక్రనియేల యీ భంగివిలపించెదవు. కారణము జెప్పుమా! సందేహము దీర్పుమా! సంతాపము బాపుమా! నీవాక్యములు నేనుగ్రహింపఁ జాలక యున్నాను.

లక్ష్మ—అమ్మా! ఇంతవఱకు వచ్చినపిదపఁ జెప్పక దాచుదునా? అట్లు జేసినందువలన బ్రయోజన మేమియున్నది? ఇదిగో! గుండె రాయి జేసికొని చెప్పుచున్నాను. శ్రీరామచంద్రుఁడు లోకాపవాదకు భయమంది నిన్ను ఘోరకాంతార మధ్యమున విడిచి రమ్మని నాకాజ్ఞాపించినాడు.

సీత—(తొందరతో) ఆ! లక్ష్మణా! ఏమీ! ఏమీ! శ్రీరామచంద్రుఁడా! లోకాపవాదకు భయమందియా! నన్నీ ఘోరగహనమున విడిచి రమ్మనియెనా! మఱది! మరలు! బలుకుము! పరాకుననిట్లంటివేమో!

లక్ష్మ—అమ్మా! సత్యము.

సీత—హా! రామచంద్రా (మూర్ఛిల్లును).

లక్ష్మ—ఈతల్లి యామాటఁ జెప్పిన యంతనే మొదలునఱికిన కదళీతరువువలె మూర్ఛిల్లినది - రామచంద్ర పదసేవాసక్త చిత్తయగు నీమె కేహానియుఁ గలుగకుండుఁగాక!

సీత—(మూర్ఛనుండి లేచి) లక్ష్మణా! ఏమిది! సుగ్రహానుగ్రహసమర్థుఁడును, జగత్పరిపాలకుండును, నిరంతర ధర్మవ్రతాచార పారీణుఁడును. నిక్ష్వాకుకులక్షీరపాథోరాసి పూర్ణిమాపాకరుండునునగు శ్రీరామచంద్రుని కపవాదయా! నాయనా! ఎవరివలన! ఆయుదంతము బూర్తిగఁ దెలుపుమా?

లక్ష్మ—ఆపాపపుఁబలుకు లీనోటనెట్లు బలుకుదును? లోకకంటకుఁడైన రావణునిచేఁ గొనిపోఁబడి యొకవత్సరము లంకయందుంచబడిన సీతను మరల దెచ్చుకొని శ్రీరాముఁడేలుచున్నాడని పామరుండగు నొకరజకుని నోటినుండి వెలువడిన నుడినిదలంచి నిన్నీరీతిఁ జేసినాడు.

సీత—హా! ఎంతనిర్భాగ్యురాలను. (మూర్ఛిల్లును)

లక్ష్మ—ఎంతకష్టము సంభవించినది.

సీత—(మూర్ఛనుండి లేచి) లక్ష్మణా! ఈనిందావాక్యములువిని ఈజానకి శరీరమునుండి ప్రాణవాయువులు లేచిపోవక యున్నవి. నన్ను నిరంతరముఁ దనప్రాణముగా జూచు జీవితేశ్వరుఁడే యిట్టినిర్దయ వహించెనుగా! పామరుని వాక్యములు విశ్వసించి నన్నిట్లు బహిష్కరించెగా! శివధనుర్భంగము నానిమిత్తముకదా చేసెను. మాయామృగంబైన మారీచుని నానిమిత్తముకదా గూల్చెను. వాలినిగూల్చి సుగ్రీవుని నానిమిత్తముకదా చేపట్టెను. మారుతిని నానిమిత్తముకదా లంకకుఁబంపెను. లోకవిద్రావణుండగు రావణునినానిమిత్తముకదా సంగరంబునఁగూల్చెను. అట్టివన్నియుఁగావించి తుదకు నేడు జ్ఞానశూన్యుఁడు—సురాపానమత్తచిత్తుఁడునగు నొకరజకుని మాటలనమ్మి నాకిట్టి యిక్కట్టు గూర్చెనే! ఆనాడు లంకాపురమందుఁ జేయబడిన నాపాతివ్రత్యపరీక్ష మఱచిపోయెనా! నాపతివ్రతాత్వము నిర్ణయించిన మహాసీయులిప్పు డెందుబోయిరి. అగ్నిభట్టారకుఁడు లేడా! యమ రేంద్రుడు లేడా! బ్రహ్మాదిదేవతాప్రముఖులు లేరా ఈసాక్షులతో నేమిపనియున్నది. శ్రీరామమూర్తి మనస్సాక్షము లేదా?

(శ్రీరామునిఁ దలంచి)

సీ॥ నిను బాయఁజాలక • వనులకు నీవెంట,
నే తెంచుటైనను • నెంచవలదె
నీ వంప లంకకు • నేగుదెంచిన వాయు
నయునిమాటల • దలఁపవలదె
సెమీాద జీవముల్ • నిలిపి దైత్యులమధ్య
నగచాట్లనందుట • యరయవలదె
యగ్నిలోఁబడుమంచు • నానాడువచియింప
నట్లొనర్చుటయైన • నరయవలదె

తే॥ గీ॥ వీనినన్నిటి మదిలోన • విడిచియున్న
గర్భవతియంచునైన లోఁ • గరుణవలదె
యక్కటా యిట్లు సేయంగ • నగునె నీకు
రఘుకులాంభోధి చంద్ర! శ్రీ • రామచంద్ర.

లక్ష్మణా? నాగుణంబెఱింగియుండియుఁ బ్రాణేశ్వరుఁడు నన్నిట్లుజేసినాడు. సంపూర్ణగర్భవతినగు నన్ను బరిత్యజించుట మీయన్నకు ధర్మమా! లక్ష్మణా! ఇదియేనా రాజధర్మము! ధర్మహీనులైన పామరులట్లుబల్కుట నాకర్మము. శ్రీరామచంద్రుడు నన్నిట్లుజేయునని కలనైనఁ దలంపలేదు. అక్కటా! ఎట్టిదుఃఖమునాకుఁ దెచ్చిపెట్టెను! అనుకూలదాంపత్యమని మోదమందితినిగాని యీరీతినగునని యెన్నఁడును దలఁపలేదు. శ్రీరాముని దేవినైతినని సంతసించితిగాని జన్మమున్నంతవఱకు నిట్లువనవాసము సేయుదునని భావింపలేదు. మత్పూర్వకృతపాపమీవిధమునఁ గట్టికుడుపుచున్నందులకేమని వగతును! మాజనకుండగు జనకుడు శ్రీరామమూర్తి ధర్మశీలుఁడని తలంచి, నన్నాతనికొసంగి పరిణయముగావించెను గానియిట్టి, కరుణాదూరుఁడనియు, నగ్నిసాక్షిగఁ గైకొన్న యిల్లాలిని నీవిధమున గడగండ్లనుంచుననియు నెఱుంగఁడయ్యెనుకదా! సౌమిత్రీ! ఎవ్వఁడో యొక నీచుఁడజ్ఞానముచే నన్నునిందించుగాక! దానిని నామనోహరుఁడు పాటించవలయునా? పాటించుగాక! నాకీమాటఁ దానేలచెప్పడయ్యె. చెప్పలేకపోవుగాక! నీరాడుదాకనైన భరింపఁగూడదా! అక్కటా! అగ్నిహోత్రుడు నన్నుఁగూర్చియొసంగిన సాక్ష్యమంతయు నసత్యమనియే తలంచెనుకదా!

లక్ష్మ—తల్లీ! సాధ్వీమణీ! నీకు సాక్ష్యమిచ్చుట కగ్నియెవ్వఁడు. సర్వభక్షకత్వము చేతకలిగిన నీపాతివ్రత్య ప్రభావమాతని పాపము బాపినది. శ్రీరామచంద్రుడు నీసౌశీల్యాది గుణంబుల, బూర్తిగా నెఱుంగును. అట్టికారణము చేతనే నీమొగమెదుట బలుకజాలక,

లోకనిందకు భయమంది యిట్లు జేసినాడు. కాలకర్మగతి నియ్యది సంభవించినది.

సీత—పోనిమ్ము, లక్ష్మణా! నీవైనను నియ్యది నాకు గృహంబునందుఁ దెలిపియుంటివేని;—ఆసూర్యవంశాబ్ధిసోముని - పరంధాముని - నీలమేఘశ్యాముని - సర్వజననయనాభిరాముని - శ్రీరామునిజేరి, తదీయ దివ్యమంగళవిగ్రహము దిలకించుట కిదే కడపటిసారి చూపని కన్నులకఱవుదీరఁ జూడకుందునా! ఇదియే తుదిసారి మ్రొక్కని తదీయవిమల చరణసరోరుహద్వయంబునకు భక్తిమీఱ మొక్కకయుందునా! మృదుమధురసంభాషణంబున కిదే పొలిమేరయని మనసారభాషించక యుందునా! హా ఎంతదురదృష్టవతినైతిని. శ్రీరాముని దివ్యమంగళవిగ్రహ సందర్శనము మరల నాకీ జన్మమున నున్నదో లేదో!

లక్ష్మ—తల్లీ! రామాజ్ఞ నన్నుఁ జెప్పకుండఁ చేసినది. మాణిక్యోజ్జ్వల రత్న సంకలిత హర్మ్యంబులందు బరిచారికా శతంబులు గొలువ, ప్రాణేశ్వరుని ప్రక్కభాసిల్లు, మహాగుణవతిని నిన్నీ ఘోరకాంతార భూమికిఁ జేర్చి మహాపాపము గట్టుకొంటిని. (చింతించును)

(అను_14)

సీత—నాయనా! మఱచి నిన్నట్లంటిని. ఇందు నీవేమి చేసితివి. అరణ్యవాసశ్రమ మించుకంతయు గలుగకుండ మున్ను నీవు నన్ను సేవించిన విధమెఱుంగనా! తండ్రీ! నీవు నాకు బిడ్డవు గాని మఱిందివికావు (ఇంచుక యూరకుండి) వత్సా! సౌమిత్రీ! కటకట చాపంబును ఖండించి నన్నుద్వాహమాడిన మోహము. కాకాసురునిఁ గంపింపఁజేసి నన్ను రక్షించినఁ పేరు; దైత్యకాంతయగు శూర్పణఖ ముక్కు చెవులఁ జెక్కి నాకుఁజూపించినఁ ప్రేమ, మాయమృగంబును దునుమాడఁబోవుచు మీవదినె భద్రమని నీతోఁ జెప్పిన అనురాగము, నాకై వనరాసిని బంధించి లంకఁ జొచ్చి దశశిరస్కుని దునిమిన కరుణ_ అక్కటా పరిత్యజించి, నేడు నిష్కరుణ వహించి, రజకుని వాక్యములే వేదవాక్యము

లని నమ్మి ప్రాణేశ్వరుఁడు నాకు ఘోరకాంతార నివాస కఠిన శిక్ష విధించెనుకదా! ఇంతకన్న శత్రుకంఠ ప్రదేశముల నాట్యమాడు తన భీకరకృపాణముచే నాకంఠంబు నఱికియున్న నేను సంతోషించియుందునే! అగ్నింబడుమన్నఁబడియుందునే! ఇమ్మహారణ్యమున నాకు దిక్కెవరు? ఎవ్వరు రక్షింతురు? ఎక్కడికిఁ బోవుదును? నామాటకేమి? నాగర్భస్థ సంతానమునకు శరణమెవ్వరు? దీనిందలంచియైన జీవితేశ్వరుఁడు కరుణవహింపఁడయ్యెను కదా! నాయనా! ఇంతకును రామచంద్రుని దూరనేల. అమ్మహాత్ముఁడు నిరంతరకరుణామయుఁడు. ఆర్తరక్షణ కళాపారీణుఁడు- ఇదియంతయు నాపాపము! సత్కులీనులెవ్వరును దుర్యశమును సైపరుకదా- అందులో దినదినప్రవర్ధమాన యశోవిరాజితమగుచున్నయిక్ష్వాకుకులంబునకు నామూలమున నిట్టినిందవచ్చినదికదా! తనకు వచ్చిన నిందకుఁగారణురాలయిన నన్ను బరిత్యజించి శ్రీరామచంద్రుఁడు తన యశశ్చంద్రికలఁ గాపాడుకొనవలసినదే. నాకీ కష్టముగలిగించినందులకు విచారింపనుగాని, భగవత్స్వరూపుండగు శ్రీరామచంద్రుని దివ్యపాదారవింద సేవకు దూరమైతిని గదా యని మాత్రము విచారించుచుంటిని. ఎవ్వరు విచారించి ననుఁ జేయునది యేమియు లేదు. "ఆజన్మాంతము నీకరణ్యావాసమే" యని బ్రహ్మ నానుదుట మూఁడుబంతులనుదీర్చి వ్రాసి యున్నాఁడు, దాని నెవ్వరు తప్పింపగలరు? అకారణ నిందను భరించి, శ్రీరామచంద్రునిచే విసర్జింపఁబడిన నేనుబ్రదికియున్నందు వలనఁ బ్రయోజనమేమియున్నది. పరమపావనమైన గంగాస్రవంతి సమీపంబునందే యున్నది. అమ్మహాదేవి నాకు మార్గము జూపించుఁగాక!

లక్ష్మ— రామ రామ- ఎంతమాటఁబలికితివి తల్లీ! ఆత్మహత్య మహా దోషము. అందు. బుత్రవతివిగానున్న నీవేదేని సాహసమునకుఁ బాల్పడితివా! భ్రూణహత్యా దోషముగూడ నీ మెడకుఁ జుట్టుకొనును. అమ్మా! కష్టము లెప్పుడును గాపురముసేయవు. చీకటి

కొన్నిదినములు వెన్నెలకొన్నిదినములు. ఎప్పటికైన నీకష్టములు గట్టెక్కకపోవు. కావున నా విన్నపమూలకించి, తనువుపై రోసి, సాహసకార్య మొనరించి రాముని నిందఁబాలుపవలదు. ఎచ్చటనేనిఁ దలఁదాచుకొని కష్టకాలము గడుపుము. రవికులవృద్ధికై నీగర్భము నైనఁ జూచుకొనుము. సమస్తదేవతలు నిన్నురక్షించి, మరల నీవిభుని సాన్నిధ్యమునఁ జేర్చెదరుగాక! తల్లీ! విభునియాజ్ఞ నగరంబునందే నీకుఁ దెలుపకుండఁ దోడ్తెచ్చినందులకు క్షమింపుము. నిన్నీభయంకరారణ్యమున నేకాకిఁగ జేసిపోవుటకు నా చిత్తము సమ్మతింపకయున్నది. కాని పోవకతప్పదు. ఈదీనుడు నిన్నుఁ బురికేగుట కనుజ్ఞ నడుగుచున్నందులకు క్షమింపుము. (కాళ్ళపై బడి) హాతల్లీ! నిన్ను విడనాడిపోవుటకు గాళ్ళాడవు.

(అను. 15.)

పుట్టినయింటను, మెట్టినయింటను గూడ ననేకబంధువులఁ గలిగినదానవయ్యు నేఁడీయరణ్యమున దిక్కుమాలిన దానవైతివికదా! రత్నఖచితసౌధంబుల నెక్కుట కాయాసమందు నీవు గుట్టల నెట్లెక్కగలవు? వనంబులం దొక్కింతకాలము విహరించినంతనే యరుణకాంతి వహించు నీచరణద్వయము లీముండ్లత్రోవలయందు నడచుట కెట్లు సమ్మతించును. పంచభక్ష్యాన్నంబుల నారగించు నీవీ కందమూలముల నెట్లు దినఁగలవు? నిన్నీయరణ్యమునకుఁ జేర్చిన యీనిర్భాగ్యుఁడగు లక్ష్మణుఁ డింకను జావకయున్నవాడు. ఓదేవతలారా! సకలబంధుపరివారము గలిగినదయ్యు విధికృతమున దిక్కుమాలినదైన యీ రాముని సతీమణిని రక్షింపలేరా? ఓయగ్నిభట్టారకా నాడు లంకాపురంబున సీత సాధ్వియని చెప్పితివే. ఇప్పుడేమూల దాగియున్నావు? సాధ్వియగు సీతను రాముఁ డీరీతి పరిత్యజింపగా,వలదని చెప్పుట కేలరావు? ఓ! చతుర్ముఖా! అగ్నిమాటలు నీవుగూడ వినియుంటివికదా. రాముసేల చేరవు? పాకశాసనా! అఖిలబ్రందారకులతో నీవేల యరుదేరవు? (అను. 16.)

సీత — వత్సా! లక్ష్మణా! నీకు నాయందున్న భక్తిచే నట్లుశోకించెదవు. కాలకర్మగతిని నీ దేవతలుమాత్రము తప్పింతురా! తండ్రీ! పోయి, రమ్ము, సంధ్యాసమయము గాకపూర్వమే నీ వయోధ్యానగరంబును జేరవలయును. మన మెంతవిలపించినను మనరోదన మరణ్యరోదనమేగాని వినువారెవ్వరును లేరు. నీవు నిరంతరము భక్తితో సేవించిన యీ సీతను మఱచిపొమ్ము. ఈమెకై బెంగవలదు. మాయత్తగారగు కౌసల్యాదేవితో, మీతోఁ జెప్పకుండవచ్చినందులకు ఫలంబనుభవించితిననియు, సీత కాపురమడవిలో గలిసినదనియు, నాసేవలు - నాభక్తి-యనురాగము- సర్వము మఱువవలసినదనియుఁ జెప్పుము. తక్కిన యత్తలగు సుమిత్రాకైకలకు నాభక్తిపూర్వక వందనముల దెలుపుము. నాచెల్లెండ్రు నాకై బెంగపడుదురు. అట్లు జరుగకుండ వారికి ధైర్యముఁ జెప్పుము. నన్నుఁ గన్నతల్లికంటె నెక్కుడుభక్తితో జూచి సేవించు భరతశత్రుఘ్నులకు నాయాశీర్వచనములు తెలుపుము. లక్ష్మణా! నీవెప్పుడును మీయగ్రజుని విడనాడి యుండవలదు. భరతశత్రుఘ్నులకుఁగూడ నట్లేచెప్పుము. అమ్మహానీయుని దివ్యపాదారవిందసేవయే మోక్షసౌధమారోహించుటకు రాజమార్గమని తలంపుము. సౌమిత్రీ! నీఋణము నే నీజన్మమునఁ దీర్పజాలను. ముందుజన్మమునందైనఁ దీర్చుకొందును. నే నెన్నిజన్మము లెత్తుచుండినను, శ్రీరామచంద్రుఁడే నాకుఁ బ్రాణేశ్వరుఁడుగను, నీవు మఱదివిగను - నగునట్లు దైవమును ప్రార్థించెదను. నాయనా! చెప్పవలసినది చెప్పితిని. ఇఁక జీవితేశునకు సందేశముఁగూడ వినుము.

సీ॥ రాతినాతిగఁ జేయు • రమణీయమగుపాద,
జలజంబులకు నమ • స్కారమనుము
తననిండ బోగొట్టు • కొనుటకై యీసీత,
జీవంబులీయ సం • సిద్ధయనుము

ఈరేడుజగములు • శ్రీరామమయముగా,
దిత్తమందెప్పుడీ • క్షింతుమనుము
అపవాదనీక బాసి • హాయిగా జనులెల్ల,
హర్షింపసౌఖ్యంబు • లందుమనుము
తే॥ గీ॥ నిజము దేవుఁడెఱుంగును • నీరుపల్ల
మెఱుగునిట్టిమాట భా • వింపుమనుము
సీతసుగుణంబులను బరీ • క్షించి పిదప
మహితకృపతోడనేలుట • మంచిదనుము.

ఎవ్వరు నన్నుఁగూర్చి యెట్టినిందావాక్యములు పలికినను నీమన స్సాక్ష్యమునకే తెలియునని చెప్పుము. మఱియు నావచనంబులుగా నిట్లు కూడఁబలుకుము

మ॥ ప్రమదంబొప్పఁగ నీదు నామమును హృ • త్పద్మస్ఫుర ద్రత్నపీ
ఠమునందుంచి నిరంతరంబును నభీ • ష్టావాప్తి నాశించి, వా
క్సుమజాలంబులఁ బూజజేతు సుమన • స్సుల్ ప్రీతినింపొంద, దై
త్యమదోద్రేకహరోగ్ర సాయకసమూ • హా! రామ! దీనావనా.
శా॥ శ్రీసంధానములై మహత్తరజగ • జ్జేగీయమానంబులై
దాసాభీష్ట ఫలప్రదాయకములై • దైత్యేంద్ర పాశంబులై
వాసింబొల్చెడు నీదుపాదముల సం • భావించి కాంతారసం
వాసాయాసభరంబు బాసెదను దేవా! రామ దీనావనా.

మనోవాక్కాయ కర్మముల నిన్నుదప్ప నే నన్యమెఱుంగను. నాచిత్తశుద్ధి నీకు సంపూర్తిగఁ దెలియును. నిరంకుశశాసనుండవగు నీయాజ్ఞఁగాదను వారెవ్వరు. ప్రాణేశ్వరా! నీవు నన్నీరీతి నరణ్యముల పాలుజేసితివని నిందింపను. నాకర్మఫలంబని వగతు . సమస్తాభీష్ట ఫల ప్రదంబును, శాశ్వతమోక్ష సామ్రాజ్యమార్గంబును, సకలపాప విధ్వంస మును-నగు నీనామస్మరణంబున జీవయాత్రఁ గడిపెదను, లక్ష్మణా! ఇఁకనేమున్నది. పొమ్ము. రామునకు- నీలమేఘశ్యామునకు- జగదభి రామునకు- నుతసుత్రామునకు- సుగుణస్తోమునకు- అఖిలదైత్యవిరాము నకు- నాకును ఋణము తీఱినది- స్నానానంతరమున శ్రీరామచంద్రుని

దివ్యపదసరోరుహంబులను- మాని యోషామణిశాపనివారణములైన పదంబులను- శబరికి మోక్షమొసగిన పదంబులను- నాపైట చెఱగుతోఁ దుడిచి కన్నుల నద్దుకొను పుణ్యము నశించినది. శయ్యాతలము నుండి లేచిన వెంటనే తదీయ దివ్యమంగళ విగ్రహము ముందుగ సందర్శించు భాగ్యమంతరించినది. ఊర్మిళాది సోదరీమణులంగూడి వనవిహారమున కేగి ముచ్చటలాడుకొను సంతోషము మాయమైనది. భరతాది మఱఁదులఁ బ్రేమతోజూచు కోర్కెయడుగంటినది. కౌసల్యాది యత్తలకు నిరంతరము పాదాభివందనములఁ జేయుచు సేవించు సుకృతము మంటఁ గలసినది. ఇక ఈసీతకుఁ బ్రపంచముతోఁ బని లేదు. అయోధ్యానగర సామ్రాజ్యలక్ష్మీ! నీకును నాకును దూరమైనది. హా! జనకా! జనక రాజా! పావనయజ్ఞవేదికా తలమున నవతరించుటంజేసి, నాసుపుత్రి యాదిలక్ష్మియేయని భావించి, సంతోషమున నన్నుఁ బెంచి, సకల సుగుణాభిరాముండగు రామునకొసంగి వివాహము జేసితివి. ఇదిగో! ఈసీత నేడిట్లగుచున్నది. నాకై పరితపింపవలదు. లక్ష్మణా! పొమ్ము. (ఇంచుక యూరకుండి) అయ్యో! పోయెదవా! ఇక నాకెవ్వరు దిక్కు. ఈయరణ్యమున నాగర్భ సంతానమును గాపాడువారెవ్వరు! అక్కటా ఎంత దిక్కుమాలిన దాననైతిని. హా! రామా! సుగుణధామా! తారక నామా! అపవాదా నన్నుఁ బరిత్యజించితివి. సీత బ్రదుకిక వ్యర్థము- వ్యర్థము- హా! ప్రాణేశ్వరా! రామచంద్రా! రఘునందనా! (మూర్ఛిల్లును.)

లక్ష్మ — ఈతల్లి దుఃఖమును జూడఁజాలక యున్నాను- అయ్యో! ఈ నట్టడవిని నీమెకు దిక్కెవ్వరు! సత్వరముగ నిమెనుడించి రమ్మని రామాజ్ఞ. ఈమెను విడిచిపోవుటకు నాకుఁ గాళ్ళాడునే. హా! పర మేశ్వరా! నన్నీసూర్యకులమున నేల జన్మింపఁ జేసితివి. హా! విధాతా!

సీ॥ జనకరాజర్షి పా • వనయజ్ఞ వాటిక
యందున జనియించి • నట్టికాంత
మనుకులంబెల్ల పా • వన మొనరింపఁగా
మాఁ రాము గైకొన్న • సారసాక్షి

సుగుణ సంపదయందు • శోభనాంగులకెల్ల
దలమానికంబైన • తలిరుబోడి
అంతరంగపు శుద్ధి • యగ్ని ముఖంబునఁ
బ్రకటించి మించిన • భవ్యశీల

తే॥ గీ॥ అట్టి సీతకా! కటకటా • యడవులందు
వాసముసుగూర్చి నాడవు • దోసమేమి
గాంచితివి యీామె, యందీవు • గాంచలేదె
సాధ్వీమహీమంబు లంకలో • జలజభవుఁడ.

నన్ను నిరంతరమున గన్నతల్లి విధమునగా పాడిన యీా సతీమ తల్లి, ఈ యరణ్యమున విడిచిపోవలసి వచ్చెనుకదా! హా! జనకరాజ పుత్రీ! అరణ్యములఁ బడిన శ్రమలెల్లను దీనవనియు, గర్భవతి వైతి వనియు, రఘువంశ వర్ధనుండగు నందనుని గాంతువనియు, మేమును నీ తండ్రియగు జనకుండును, సంతోష సాగరంబున నోలలాడుచుంటిమి. అక్కటా! అట్టి సంతోషమునకు మేము దూరులమై పోయితిమి, ఎవని నిగూర్చి మేము నిరంతరము నానందమును బొందుచుందుమో యట్టి నీవు మాకు దూరమైపోయితివి. నా యనువారు లేని ఘోరారణ్యమున నుండవలసి వచ్చినది. సాధ్వీమణీ! మున్నరణ్య వాసమునుగూర్చి మీా జనకుండువిని చింతించినను నీవు రాముని ననుసరించి యుండుటంజేసి కొంతవఱకు ధైర్యమవలంబించి యుండెను. ఇప్పుడు రాముఁడ నిన్నిట్లు బరిత్యజించెనని విని యమ్మహాసీయుఁడు రాజఋషియే యగుగాక! వైరా గ్యచిత్తుఁడే యగుగాక! కడుపువంటిదేది మఱియొకటి లేదుకదా!అయ్యో ఎంతగాఁ జింతించునో! చింతించుటేకాదు. ప్రాణములు విడుచునేమో ఆర్తత్రాణ పరాయణా! నారాయణా! భక్తవశంకరా! శంకరా! భారతీ నాయకా! చతుర్ముఖా! సమస్త బృందారక నాథా! పాకశాసనా! మీా రెవ్వరును నీరాముని దేవిని గాపాడలేరా? ఓ మునిసత్తమా! గాధేయా! సీతను మారామచంద్రునకు వివాహము జేయించితివే. సృష్టికి బ్రతిసృష్టి గావించిన యపరబ్రహ్మవు. మాజానకిని రక్షింపలేవా? రఘురాముడు కోపావేశమున జానకిని విడిచిరమ్మన్నంతనే, కరుణ విడిచి యీాలక్ష్మ

ణుండిట్లుజేసెనని మీరుగూడ గరుణావిహీన యుంటిరా! ఇక నీ జానకీ దేవికి దిక్కెవ్వరు, తల్లీ! జానకీ!

సీ॥ పుట్టింటనే సౌఖ్య మునుంబొందితివా కాని
యత్తింట సుఖముల • నంద లేదు
ప్రాణేశుగా రాము • బడసియుండుట కాని
సుఖముల నేనాడు • చూడ లేదు
వలసిన సంపదల్ • గలిగి యుండుట కాని
విపినోర్వి వాసంబు • విడువ లేదు,
పట్టంపుదేవివై • వరలుచుంటివి కాని
యెప్పుగా పురమందు • నుండ లేదు.
తే॥ గీ॥ బ్రహ్మవ్రాతకు నే మంచు • వగచువాడ
తల్లి గుణకల్పవల్లి • సీతమ్మతల్లి
యెట్లు రక్షించుకొందువో • యీ శరీర
మీవు. నేనిక నగరంబు • కేగువాడ.

సీ॥ ఘనభక్తిఁబరిచారి • కలుగొల్వ విలసిల్లు
నీవు వనాళిన • ట్లుండఁగలవో
మందిరారామసీ • మలఁ జరింప వెఱచు
నీవు కొండల నెట్లు • లెక్కఁగలవో
వన రసాన్నంబునఁ • దవిలి యుండెడు నీవు
వన ఫలంబుల నెట్లు • దినఁగ గలవో
శ్రీరామ పద సేవ • సేయుచుండెడు నీవు
నొంటిగా గాన నె • ట్లుండఁగలవో
తే॥ గీ॥ ఎండకన్నన నేమియో • యెఱుఁగనట్టి
యమిత సుకుమారి వెట్లువ • రాతపముల
నోర్వగలవో! సాధ్వీమణీ! • యుర్విజాత
మహిత సద్గుణవ్రాత! యో • మాత! సీత ॥

ఈ జగన్మాత నెడబాయఁజాలక యిట్లు దుఃఖవార్ధి యందు మునింగియున్నచోఁ బ్రయోజనము లేదు. ఈ యమ్మ మూర్ఛనుండి లేచి

నచోమతింత దుఃఖము కలుగును. కావున సత్వరమునఁ బోయెదను. (ఇంచుక నడిచి) అక్కటా! ఎట్లుపోవుదును? వచ్చునప్పుడు సీతతో వచ్చితిని. ఇప్పుడు రథమందు సీతలేకుండ నగరంబును. బ్రవేశింపవలయును అచ్చట వారందఱును సీతయేమయ్యెనని యడిగిన నేమని ప్రత్యుత్తర మిత్తును?

సీ॥ పద్మాక్షి వనిడించి • వచ్చితే.లక్ష్మణా
యనురాఘవునకు నే • మనెడువాడ
వంశపావనియైన • వైదేహి యేదిరా
యనెడు కౌసల్య కే • మనెడువాడ
మఱిదండ్రు ననుఁ జేరి • మాయక్క యేదన్న
పలుకుల కేమని • పలుకువాడ
మహిళాలలామ మా • క్ష్మాపుత్రి యేదను
చెలికత్తెలకు నేమి • చెప్పువాడ

తే॥ గీ॥ మహితసాకేత నగరసా • మ్రాజ్య లక్ష్మి
సీతనెచ్చోట డించి వ • చ్చితి వటంచు
నధికదుఃఖార్తులై నన్ను • నడుగునట్టి
పౌర సముదయంబున కేమి • పలుకువాడ

అక్కటా! నేనెంత పాపకర్ముఁడనైతిని. సీతలేకుండ నగరంబున కేగిన నన్నుఁజూచి యిట్టి యకార్య మొనర్చి వచ్చినందులకు కౌసల్యాది జననులు దూషింపరా! భరతాదులు ఆగ్రహింపరా! ఊర్మిళాదికాంతలు- చిత్తంబులయందునన్నుఁ గఠినచిత్తునిగాదలంపరా! పౌరులందఱును నిందింపరా అన్నిఁటికిని నొడిగట్టితిని. ఏమైనను బోవక తప్పదు- ఓసీతామహాదేవీ! అనవరతమునిన్నుఁదల్లిగా భావించి సేవించిన యీలక్ష్మణుఁడు;—అనుదినంబును భక్తిపూర్వకంబుగ నీపాదాభివందనము సేయుచు- లక్ష్మణుడు మహాభక్తుఁడు- సద్గుణమూర్తియని నీవినుతిఁ గన్న లక్ష్మణుఁడు- అరణ్యావాసమున వన్యఫలంబులదెచ్చి ప్రేమతో సమర్పించుచుఁ గంటికి రెప్పచందమున నిన్ననిశంబు రక్షించిమించినలక్ష్మణుఁడు; నేడు కఠినచిత్తుఁడై- పరమపాతకుఁడై- నిర్భాగ్యుఁడై- కఠిన

పాపాణకంటకపరీతమై, సింహశార్దూల భల్లూకాది క్రూరమృగ శరణ్యంబైన యరణ్యమున- నిన్నొంటిగా- దిక్కుమాలినదానిగ జేసిపోవుచున్నాడు- అమ్మా! నాకడసారి వందనము లందుకొమ్మా. (సీతపాదములకు నమస్కరించి) ఓభూదేవీ! నీకన్నపుత్రికయగు సీతను నీవే కాచికొమ్మా- ఓలోకబాంధవా! నీకులము పావనము సేయ నీయింటి కోడలైన యాదిలక్ష్మి- ఈ జానకిని సర్వకాల సర్వావస్థలయందును రక్షింపుము. ఓతాపసపత్నులార! త్వదీయసందర్శన కుతూహలాయత్త చిత్తయై యరుదెంచిన యీపుణ్యచరిత్రను మీరు కాపాడుడు- ఓపరమపావన స్రవంతీ గంగాభవానీ! ఈసీత నెట్టి సాహసకార్యము సేయకుండ వారించి బ్రోచుభారము నీయది. తల్లీ! జానకీ! నీవు పదిమంది చుట్టములలోనున్న దానవు గనుకనా! వారు నీకిదిసేయుదురది సేయుదురని చెప్పుటకు. ఇది మహారణ్యప్రదేశము. నేను నిన్నెవ్వరి కప్పగించి పోవుదును- అమ్మా! అరణ్యముననుండు సర్పంబులు తమ క్రూరత్వమును విడచి, యొడయందు దమభోగములు నీకు ఛత్రముగాఁ బట్టుగాక! సింహశార్దూలాది దుష్టమృగంబులు నీయొద్ద కురంగముల చందమునఁ జరించుగాక! ఫలవృక్షములు నీయాకలి నెఱింగి వివిధఫలంబుల నొసంగుఁగాక! నీసాధ్వీత్వమను కవచమే నిన్ను సంతతము రక్షించుగాక- ఓసమస్తదేవతలారా! సూర్యచంద్రులారా! గ్రహములారా! వనవాసతపస్వులారా! సీతనువిడిచి నేనరుగుచుంటిని.

సీ॥ జనకరాజేంద్రుని • సత్పుణ్యవశమున,
ననుఁగుఁబుత్రికయైన • యాదిలక్ష్మి
మనువంశతిలకుఁడౌ • మా రామచంద్రుని
పాణిఁబట్టిన నవ • పద్మనేత్రి
పతిసేవయే ముక్తి • భవనమునకు రాజ
మార్గమనితలంచు • మహితచరిత
తనదివ్యమహిమంబు • ననలుసమ్ముఖమునఁ
బ్రకటించిన సుగుణ • వంతురాలు

తే॥ గీ॥ మఱదులను, బిడ్డలవితాన ♦ మనుపుతల్లి
మగువలకునెల్లఁదలలోని ♦ మాసికంబు
ప్రజలసన్నుతిఁగాంచిన ♦ భవ్యశీల
సీతరక్షింపుఁడీమీరు ♦ చేరి కరుణ

(నిష్క్రమించును.)

సీత—(మూర్ఛనుండిలేచి) లక్ష్మణా! లక్ష్మణా! (దిక్కులు పరికించి) హా! లక్ష్మణా! మీవదినెను విడనాడి యరిగితివా! అయ్యో! ఇకనాకేమిదిక్కు, ఈయరణ్యమున నెక్కడికి బోవుదును! హా! రామచంద్రా! తేనెపూసిన కత్తి చందంబుననుండు నీకపటానురాగ వాక్యములునమ్మి నేను మోసపోయితినే. నీవిట్లు సేయుదువని నేనెన్నఁడును తలంపనైతినే. దుర్భర గర్భభారమున నడుగుదీసి, యడుగు కదపలేని యీ కాంతను నిట్లరణ్యములపాలు జేయుట ధర్మమని తోచినదా! ఇట్టికార్య మొనర్చినందువలన నీకుఁ బాపము సంభవించునని తోచలేదా! ఇదియా! రాజశాసనము! ఇదియా రాజధర్మము! సమస్తలోకమునకుఁ బ్రభుఁడవై యుండిన నీవు- నీయిల్లాలునగు నాయెడలఁగరుణ వహించుటకు నీకు స్వాతంత్ర్యము లేకపోయెనా? ఎవ్వడోయొక రజకుని మాటయే సాక్ష్యమయ్యెనా! శ్రీరామచంద్రుఁడు కరుణామయుఁడు ఆర్తజన రక్షణుఁడు- ధర్మశీలుఁడు న్యాయన్యాయ విచారణపటిష్టుఁడు అని నిన్నార్యులు జెప్పుకొందురే అక్కటా! వీనికి నేడు భంగము కలుగలేదా? నాథా! నాయెడల నెంతకఠిన హృదయుండవైతివి నేను నీయెడలఁజూపిన భక్తి - ప్రేమ- యనురాగము- సకలము మఱచిపోయితివా? (ఇంచుక యూరకుండి) హా! ఇది యేమి! నాహృదయ సరోవరవిహార రాజహంసయగు శ్రీరామ చంద్రమూర్తిని గూర్చి కఠినముగాఁ బలుకుచుంటినే ఇట్టి సంకట ముఁగలుగుట చేతమానసమునొచ్చియమ్మహనీయునినట్లుబలికితిగాక! ఆతనివలన నేలోపమైనగలదే. రామా! నిన్నుదూషించినందులకు నన్ను క్షమింపుము. నీవు వేదాంతవేద్యుఁడవు, నిరంజనుఁడవు, పరబ

హ్మవు. అవ్యయుఁడవు, అప్రమేయుఁడవు, మునిజనామరవంద్యుఁడవు. సకలసృష్టిస్థితిలయకారణుండవు, నీ మహామహిమ నాబోటిబోటి యెఱుంగఁగలదే. దేవా! నీవు నాయెడలచేసిన దేమియును లేదు. ఇదియంతయు నాప్రారబ్ధము, నాపాపము, ఓదేవతాలారా! ఇట్టి యవస్థలఁ బొందించి యీసీతను నింకను నెందుకుబ్రదుకనిచ్చిరి. ధర్మసంస్థాపనసేయు శక్తి మీయొద్ద లేకపోయినది కాబోలు! ఇకఁ బ్రపంచమున ధర్మమడుగంటి యధర్మమే హెచ్చిపోవునా! మీరందఱునుగూడ రాముని శాసనంబునకు బద్ధులైయుండిన కారణముననే యిట్లుచేసిరని తలంచెద, కాకున్న నొక్కరైన ముందుకువచ్చి నన్నేల రక్షింపకుందురు. (తన్నుద్దేశించుకొని) ఓనిర్భాగ్యపుసీతా! నిన్నుఁబతి పరిత్యజించినాఁడు. మహారణ్యమున దిక్కుమాలినదాన వైతివి. ఇక నీవెవ్వనినిమిత్తము దేహమునఁ బ్రాణములు నిలిపియుంచితివి. ఎందుకీ నిర్భాగ్యపు బ్రదుకు! సత్వరముగ నాలోఁబడి జీవములబాసి శాశ్వతసుఖంబుఁ బొందుమని. అదిగో! గంగాభవాని పిలుచుచున్నది. (గంగనుసమీపించి) తల్లీ! భాగీరథీ! పాపచిత్తయని భావింపక నన్ను నీలోఁగలుపుకొనుము.

వాల్మీకి—(త్రొందరగాఁబ్రవేశించి) ఆగుము, ఆగుము, సాహసకార్యము వలదు.

సీత—ఓసహో! ఈమహానుభావుఁ డెవ్వరు? నన్నీయుద్యమమునుండి వారించుచున్నాడు, లక్ష్మణుఁడు చెప్పినమాటలమఱచి దుఃఖావేశమున నొడలుతెలియక గంగయందు బడదలంచితినే, తలంచినప్పుడు చాపుగూడరాదని చెప్పుదురు. (వాల్మీకినిఁజూచి) మునీంద్రా! ఈదీనురాలి వందనంబులందుకొని, కరుణించి తామెవ్వరో తెలుపఁగోరెదను.

వాల్మీ—జనకపుత్రీ! నన్ను వాల్మీకియందురు. నీతండ్రికిహితుండ - దశరథుఁడు మాకుఁదెలిసినవాడే! రాముఁడా భగవంతుఁడే, నీయుదంతము నేను దివ్యదృష్టినెఱింగితిని.

సీత—తల్లడి! ప్రమించుము. ప్రాచేతసులని మిమ్ము గ్రహింపజాలనైతిని. మరల నావందనంబులందుకొనుడు. (నమస్కరించును)

వాల్మీ—

సీ॥ జీవితేశ్వరుఁడైన ♦ శ్రీరాముడీరీతి
జేసెనంచు దిగులుఁ జెందకమ్మ
పామరుండాడిన ♦ పల్కులేవేడ వా
క్యములౌనటంచును ♦ నరయకమ్మ
నీదుపతివ్రతా ♦ నిర్మలమహిమంబు
దేవతాతతికెల్ల ♦ దెలియునమ్మ
యిల్లుఁగట్టుకొనుచు ♦ నెప్పుడుకష్టంబు
లొకచోటఁగాపురం ♦ బుండవమ్మ

తే॥ గీ॥ చీకటలు పోయివెన్నెలల్ ♦ చెలుగునట్లు
కష్టములఁబాసి సౌఖ్యంబుఁ గందువమ్మ
రమ్మ! తల్లిరో నాకుటీ ♦ రమ్ముఁజేర
నాతి! నిన్నుబ్రోచు భారంబు ♦ నాదిసుమ్మ

తల్లీ! ఆకనుపించు తరులచాటుననే నాయాశ్రమమున్నది. నీవందు సుఖముగ నుండవచ్చును. నీకు భయమేమియు లేదు.

(అనుబంధము 17)

సీత—ఈసమయమున నన్ను రక్షింపవచ్చిన మీకనేక వందనములు. మీరు నాకు తండ్రివారు కాని, మహాత్మా! నాకష్టమొకనాటితోఁ బోవునదికాదు- అదియుంగాక, నాధునిచేద్యజింపఁబడిన నన్నుగూర్చి యచ్చటివారు శంకింతురేమోయను భయము గూడఁగలుగుచున్నది.

వాల్మీ—అమ్మా! నీచిత్తమున నెట్టి సంశయముగాని, భయముగాని పొందవలదు. నిన్ను శంకింతురా! ఎట్టిమాటఁ బలికితివి. నీవుపుట్టువతోడనే మహాపవిత్రవు. నీసౌశీల్యాది గుణంబు లెఱుంగని వారెవరు? కారణాంతరములచే నిట్టిది సంభవించినది. ఆదిలక్ష్మివగు నీవు నన్ను గృతార్థుని జేయుటకే యిట్లు వచ్చితివి. నే

నొకటియు జనకుఁ డొకటియుఁగాదు మా మునిపల్లెయే మిథిలానగరముగను వచ్చట నున్న తపస్వినీజనంబులు నీ చెల్మికత్తెలుగను భావింపుము పురుఁడు బోసికొనుటకు జనకన మానుండనగు నాగృహమునకువచ్చితినని తలంచి సంతసింపుము. కుమారీ! నీకచ్చట నేవిధమయిన కొఱంతయు గలుగదు నీపరిచర్యకై తాపసుల కన్యకలనియమింతును. పెట్టుపోతలయందు నేను బీదనైనను గరుణకుమాత్రము కాదు. నగరంబుననుండు మణీమయమందిరంబులును హంసతూలికాతల్పంబులు పంచభక్ష్యపరమాన్నంబులు మొదలగునవి లేకపోయినను, సంతకుమించు సౌఖ్యమే మా తాపస కుటీరంబులయందుండును.

సీత—తండ్రీ! సముద్రమునఁబడి కొట్టుకొనిపోవుచున్న మానవునకు దెప్పకొయ్య దొరకిన విధమున నాకీవిపత్సమయమున నీవడ్డు పడితివి. ఇదిగో! నేను నీయాజ్ఞ ననుసరించుచున్నాను.

వాల్మీ—కుమారీ! ఆశ్రమమునకిదియే త్రోవ- ఇటురమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.



# లవకుశ నాటకము

## చతుర్థాంకము.

రంగము:—(వాల్మీకాశ్రమము:- ప్రవేశము;- సీత.)

సీత—(తనలో) నందనోదయ భాగ్యమునంది, వాల్మీకి మునీంద్రుని చే రక్షింపఁబడుచున్నను - పతిసేవకు దూరమైతి ననుచింత నా స్వాంతమున బోలేదు. ప్రాణేశ్వరునిపై జింతపోవునా! నామనః కాముఁడు - నాహృదయకుముదినీసోముఁడు - అగు శ్రీరాముని దివ్యమంగళవిగ్రహముజూడని దినము నాకు దుర్దినము - నే నీ వాల్మీకాశ్రమమున నీరాడి సుపుత్రుల నిరువురఁ గాంచియుంటి నని శ్రీరామునకుఁ దెలిసియుండునా! తెలిసియున్నచో నన్నేల పురికిఁ దోడ్కొనిపోవకయుండును. అయ్యో! ఇదియేమి వెఱ్ఱి. లోకాపవాద నివారించుకొనుటకుగదా నన్నిట్లు బరిత్యజించి నాఁడు. నేను శ్రీరాముని సన్నిధికేగు భాగ్యమునోచియుంటి నా? ఇదియంతయు గొంతెమ్మ కోరిక. నేనే శ్రీరామునివజ్జ నుండి యిట్టి సుపుత్రోదయమును గాంచియుంటినేని, కౌసల్యా మహాదేవి యెంతగా సంతసించియుండునోకదా! భరతాది మఱఁదుల యానందమునకు మేరలేకయుండునుకదా! హా! తండ్రీ! జనకరాజర్షి! భవదీయపావన యజ్ఞవేదికాతలంబున నవతరించి యుండుటంజేసి, నాపాలిటి కాదిలక్ష్మియని సంతసించి, నిజతనూ

జగ గ్రహించి యతిగారాబంబునఁ బెంచి నాతోడిదే లోకమని యెంచి; శ్రీరామచంద్రున కర్పించి యానందించితివి. పుట్టినింటఁ బురుడుపోసికొనుభాగ్యము నాకు లేకపోయినది. మనమల జననముజూచి యానందించు భాగ్యము నీకు లేకపోయినది, ఆహా! ఇట్టిది నీగృహమునందే జరిగియున్నచో నీవలనీవును, నావల పితృగృహమువారును రఘుకుల విస్తారకులగు. నీకుమారుల జన్మ మహోత్సవమెంతగాఁ జేసియుందురో కదా! రామా! భక్తజన కల్పద్రుమమా! నందనోదయమునుగూర్చి నీవు వినియుండి సీతను బురంబునకుఁ జేర్చువిషయ మాలోచించుచుండ లేదా! కుమారోదయము నీకు సంతసము కాదా! అపనిందజనింపఁజేసిన జానకి గర్భమున జనించినారని తలంచి యీకుమారులయెడఁ గూడ నీవు నిష్కారణవహించితివా?

(అను. 18.)

సీ॥ పరమసౌఖ్యవ్రాత • వరతారకాగణం-బునకు,
సుతుడెకదా • వనజవైరి
బహుఘోరసంసార • వారాసిఁదరియింప,
జేయఁబుత్రుఁడెకదా • చెలగునౌక
శ్రీముక్తి నామక • సీమంతినింగూర్ప,
తనయుఁడెకద! తగు • తార్పులాడు
సద్వంశవరకీర్తి • చంద్రికల్ జరియింప,
బుత్రుఁడెకద! మేటి • భూరుహంబు
తే॥ గీ॥ పుత్రుఁడేకద సుఖముల • మూలమరయ
నాత్మజుఁడెకదా దురితల • తాలవిత్రు
డట్టిపుత్రుఁ డొక్కడెగాక • యవని నీకు
నిరువు రుదయించి రనుమాట • నెంచవేల?

ఈవాల్మీకి మహామునీంద్రుని కరుణ యపారము. నాకేవిధమయిన కొఱంతయే సమయమునగలుగునో యని నన్నెన్ని విధములనో గని పెట్టి రక్షించుచున్న యమ్మహానీయుని ఋణము తీర్పజాలను. కన్నతం

ద్రీని మఱచించినాడు. శ్రీరాముని యెడఁబాసినందువలనఁగలుగుచుండు దుఃఖమున్ను బాపినాడు కుమారులకు గావలసిన సమస్తవిద్యల నేర్పుచున్నాడు. (తెరలోనే దియో ధ్వనివిని) ఏమది ! లవకుమారుడేదియయిన యల్లరిచేయుచుండెనా యేమి? అబ్బా! ఈలవునితో బ్రదుకజాలకయున్నాను. బహుదుండగీడు ఇతరుల నేక్షించిన నేనంతగావిచారింపనుగాని గురుండగువాల్మీకి నే పెక్కుత్రిప్పలుపెట్టుచుండును. నిద్రఁబోవుచున్న సమయమున గడ్డములాగును, దండము దాచును కమండలజలమును బారవోయును. అత్తాపసోత్తముఁడు వానికొంటెపనులకు నవ్వుచునూరకుండును గాని యొక్కింతయుఁ గోపింపడు. ఇంత చను విచ్చుటచేతనే వాడింత యల్లరి సేయుచుండును పెద్దవాడింతయల్లరిసేయఁడు(ఎదుటజూచి)అరుగో కుమారులిట్లు వచ్చుచున్నారు. వీరిలో వీరెందులకో వాగ్వాద మొనర్చుకొనుచున్నారు.

(లవ కుశులు-ప్రవేశించుచున్నారు).

సీత—కుమారులారా! మీలో మీరు కలహించు చుండిరేమి?

లవ—(రహస్యముగా) ఒరే! అన్నయ్యా! చెప్పకురా! సింహామునంగతి! పాఠము చదువుకొనుచు గురువుగారి సన్నిధి నున్నామని చెప్పు

కుశు—నీమూలమున నేనుగూడనసత్యములు పలుకవలసివచ్చుచున్నది.

సీత—(లవునిఁజూచి) లవా! ఆగుసగుస లేమి!

లవు—ఏమీ లేదమ్మా! గురువుగారు చెప్పిన పాఠము జ్ఞాపకము జేసికొనుచున్నాము.

సీత—అవురా! బొంకులకు నీవు పుట్టినిల్లయితివే. (కుశునిఁజూచి) కుశా! నీవు నిజము జెప్పుము,

కుశు—(మాట్లాడక యుండును.)

లవు—అమ్మా! అన్నయ్య యెవరిదగ్గఱనైనను గట్టిగా మాట్లాడలేక పోవుటచేతనే, అందఱు వెఱ్ఱివాడందురు. అడిగిన మాటకు వెంటనే జవాబు చెప్పు తెలివి యన్నయ్యదగ్గఱలేదు. అన్నయ్యా! అమ్మమాటకు మాట్లాడవేమి! పాఠములే జ్ఞాపకము జేసికొనుచున్నామని చెప్పలేవూ!

సీత—నీవబద్ధము లాడుచున్నదిగాక వీనికిఁ గూడ నేర్పుచున్నావా! ఇప్పుడు మీరెక్కడనుండి వచ్చుచున్నారు?

లవు—గురువుగారివద్దఁ బాఠములు నేర్చుకొని వచ్చుచున్నాము.

సీత—వాల్మీకులువారు ఆశ్రమమున లేరని వినియుంటినే.

లవు—అవునమ్మా! మాకుఁ బాఠములుచెప్పి ఆయన యెచ్చటికో వెళ్ళినారు.

సీత—నాయనా! అట్లబద్ధము లాడవచ్చునా!

లవు—కాదమ్మా! నిజము చెప్పెదను వినుమమ్మా! ఆశ్రమములో మేము పాఠములు చదువుకొనుచుండఁగా నొక సింహగర్జనము వినవచ్చినదమ్మా. అంతట నేను పాఠముల నాపి పరుగెత్తుకొని వెళ్ళినాను. అన్నయ్యకు భయము. వలదని చెప్పెను. ఉట్టిపిరికి వాడు. అమ్మా! నమ్మెదవో లేదోకాని అరణ్యమంతయు ప్రతిధ్వనియిచ్చునట్లు గర్జనములు సలుపుచున్న యాసింగమున కెదురుగా బోయి పట్టుకొని త్రాటితో గట్టి తెచ్చి కుక్కవలె యాశ్రమోపాంతమున గట్టినాను.

కుశు—అమ్మా! వీడెప్పుడును నిట్టిదుడుకుపనులనే సేయుచుండును. వలదని చెప్పిన వినఁడు.

లవు—చేతకాని వారిట్లు చెప్పుచుందురు. అమ్మా! అన్నయ్యకుఁబిఱికి మందుపోసినావు. దుష్టమృగములను సంహరించినందువలన నెంత లాభమున్నదో వీని కేమి తెలియును! అరణ్యములయందు తపము జేసికొను మహానుభావులకు మృగభీతియుండదు. అందుకనే నేనిట్టిపనిఁ జేయుచుందును. అవి నన్నేమియు జేయవు.

సీత—కుమారా! దుష్టమృగంబులను నమ్మిన వారెవ్వరు? నీవెప్పుడును నిట్టి సాహసకృత్యములు సేయవలదు. ఈసారి చేసితివేని తాత గారితోఁజెప్పి దండింపఁజేయుదును.

లవు—తాత నన్ను దండింపఁడుగా! ఆయనకు నన్నుఁజూచినమఃస్తు.

వాల్మీ—నిజము నాయనా? నిజము. (అనుచు ప్రవేశించును)

సీత—తండ్రీ! నమస్కారములు (వాల్మీకికి నమస్కరించుచున్నది.)

వాల్మీ—అమ్మా! జనకరాజకుమారీ? మదీయాశ్రమంబున నేవిధమయిన కొఱంతయు నందకుండ సుఖంబుగనుంటివికదా! తపస్వినీజనములు నిన్ను భక్తిశ్రద్ధలతో, జూచుచుందురా! సపర్యలయందేలోటును లేదుకదా! తల్లీ? నీవు సామాన్యముగ మముబోంట్ల యాశ్రమములకు వచ్చుదానవు కావు. నీవు సాక్షాదిందిరాదేవివి. నీరాకచే మామునిపల్లె యంతయుఁ బావనమైనది. ఆగర్భశ్రీమంతురాలవగు నీకు సౌఖ్యమునకేమి కొఱఁతకలుగు చున్నదో యని యప్పుడప్పుడు భయమందుచుందును.

సీత—తండ్రీ! నీయాశ్రమమున నాకుఁ గొఱఁత కలుగునా?

సీ॥ ప్రాణముల్ గంగాభ • వానికర్పింపగా
సిద్ధమైయుండర • క్షించినావు!
కష్టకాలము నెల్లఁ • గడుపుదునంచు వ
చించి నీకుటీరంబు • జేర్చినావు
కన్నతండ్రివి తానఁ • గరుణతోఁ జూచుచు
బురుడు పుణ్యాంబులు • పోసినావు
వంశవర్ధనులైన • వరకుమారులు వీరి
కెల్లసువిద్యల • నిచ్చినావు
తే॥ గీ॥ నీకృపావిశేషంబు, వ • ర్ణింపఁ దరమె
కేవలము తాపసుండవె • నీవు, నాదు
పాలిటికి దేవుడవౌచు • బఱగినావు
ధన్యగుణసాంద్ర వాల్మీకి • తాపసేంద్ర.

నీమహోపకారమును నేను జన్మజన్మములకైనను దీర్పజాలను.

వాల్మీ—కుమారీ! బ్రహ్మలోకమున దీర్ఘతర సత్రయాగమొకటి జరుగనున్నది. దానిఁ జూచుటకు బ్రహ్మచే నేనాహ్వానింపఁ బడితిని. వెళ్లక తప్పదయ్యెను. అచ్చటి కిప్పుడేఁ బోవుచున్నాను. అతిథి అభ్యాగతుల పూజలనుగూర్చి తపస్వినీజనములకుఁ జెప్పియున్నాను. సకలము దెలిసిన నీవు వారిని దగువిధమున నడుపుచుండుము. నేను సత్వరముగ నేయరుదెంతును. (లవకుశులనుజూచి)

కుమారులారా! దుడుకు పనులు, సాహస కార్యములను నేయు చుండక నే వచ్చువఱకు నే జెప్పిన రామాయణమును జదువు కొనుచు నాశ్రమమున కేవిధమయిన భయము గలుగకుండ గాపాడుచుండుడు.

లవు—తాతా! మనయాశ్రమమునకు భయము కలుగునా! మీయాశ్రమమున లవుఁడున్నంతవరకు నట్టిది యెన్నడును సంభవింపదు. మన యాశ్రమప్రాంతమున కిదివఱకువచ్చినదుష్ట మృగములను బట్టుకొని పెంపుడుకుక్కలుగా జేసినసంగతి మీకు దెలియదా?

వాల్మీ—(నవ్వుచు) అమ్మా! నేనుపోయివచ్చెదను. నీవుజాగ్రత్తగ నుండుము (నిష్క్రమించును)

సీత—కుమారులారా! మీతాతగారు జెప్పిన రామాయణకథ మీరెప్పుడను నాశ్రమమునందే చదువుచుందురుగాని యొక్కసారి యయిన నాకు వినిపించలేదేమి! నేడాకథయందు కొంచెము భాగము వినిపించి చెవుల పండువ సేయుడు.

కుశు—అమ్మా! తాతగారు రామాయణ మహాకావ్యము నత్యద్భుతముగా రచించినాడు, అందలి కథానాయకుని పేరు రాముఁడు. తండ్రి సత్యవాక్యము పాలించుటకు నతనిభార్యయగు సీతతోడను తమ్ముడగులక్ష్మణునితోడను నరణ్యముల కరిగినాడు. అరణ్యమున నుండగా నామహాసాధ్విని రావణుడను దనుజుఁడు లంకకుఁ గొనిపోవ, రాముఁడు వానరబల సహాయమున వార్థి బంధించి లంకఁజొచ్చి, దానవుని గూల్చి భార్యను దెచ్చుకొన్నాడు. ఇదిమూలకథ.

లవు—(పాడుచున్నాడు)

(అనుబంధము 19)

సీత—(కన్నీరు గార్చును)

లవు—అమ్మా! నేనీభాగము జదివినంతనే నీచిత్తము విచారపూరితమైనదేమి? ఈ ఘట్టము బాగుగలేదా! మఱియొకటి చదువుమందువా?

సీత—రామాయణములో బాగులేని భాగముండునా? తండ్రీ! నేను విడిచినవి యానందభాష్పములు.

కుశు—అమ్మా! రామాయణ కథానాయకుఁడు ధీరోదాత్తుఁడు. నిశ్చయముగా భగవత్స్వరూపుఁడని, యతఁడు చేసిన యమానుష చర్యలనుబట్టి గ్రహింపవచ్చును.

సీత—(విచారించును.)

లవు—అదియేమి అమ్మా! రాముని సంగతి జెప్పినంతనే మరల విచారమును సూచించితివి. (ఇంచుక యూరకుండి) అట్టి రామాయణ యుద్ధములో నావంటి వా డుండవలసినది.

తే॥ గీ॥ కపిబలంబుల సాయంబు ♦ గాంచకుండ
లీల దానవ బలమెల్ల ♦ నేలఁగూల్చి
దశశిరస్కుని భుజబల ♦ దర్ప మడఁచి
రామఁగూర్పక యుండునే ♦ రాముఁనకును.

మొత్తముమీఁద రావణునిఁ జంపుటకు రాముఁడు చాల యవస్థపడినాడు.

సీత—(మనలో) ఆహా! వీని వచనము లెంతో కర్ణరసాయనముగ నున్నవి.

లవు—అమ్మా! ప్రతిదినము నిన్నుఁ జూచి మురియుచుందుము. కాని మఱపు వచ్చుచుండును. మాతండ్రి యెక్కడను గానిపింపఁడేమి!

కుశు—తల్లీ! మాతండ్రియెవరు? ఎక్కడనున్నాడు.

సీత—ఉన్నాడు. నాయనలారా! మీతండ్రి సాక్షాత్ శ్రీమన్నారాయణ స్వరూపుఁడు.

లవు—ఏమేమీ! మాతండ్రి యంతటి మహానుభావుఁడా?

ఉ॥ అంతటి వానిగర్భమున ♦ నద్భుతజన్మము నందియున్ వన
ప్రాంతములందు నిట్లు ముని ♦ వర్యుల యాశ్రమమందునుంటచే
వింతగ దోచుచుండె నిఁక ♦ వేడ్కలరారఁగ మాకు నీదు వృ
త్తాంతము సర్వముఁ దెలుపు ♦ తల్లిరో నీకు నమస్కరించెదన్.

సీత—(తనలో) ఈకుమారులకు బుద్ధి తెలియుచుండుటచే జనకుని వృత్తాంతము తెలుపుమని యడుగుచుండిరి. నేనేమని చెప్పుదును!

(తెరలో)

అమ్మా! జానకీ! అతిథులు వచ్చియున్నారు. వారినిఁ బూజింపవలయును రమ్ము.

సీత—నాయనలారా! వింటిరా! అతిథిపూజకు వేళయైనదని తపస్వినులు హెచ్చరించుచున్నారు. మీకు గూడ భోజనము వేళయైనది. వాల్మీకులవారుగూడ నాశ్రమమున లేరు. గావున నతిథి పూజలయందు మిగుల శ్రద్ధగ నుండవలయును, రండు. తరువాత నెమ్మదిగాఁ జెప్పుదును,

(అందఱును నిష్క్రమింతురు.)

రంగము:—[అయోధ్య మందిరమున - శ్రీరాముఁడు తల్పమునవిచారముతోఁ బ్రవేశము. ప్రక్క లక్ష్మణుఁడు నిలిచియుండును.]

శ్రీరా—నాచిత్తమును బ్రహ్మ కఠినపాషాణముతో నిర్మించెనుకాబోలు! కాకున్న నజ్ఞునియగు రజకుఁడాడిన వాక్యములఁ బాటించి, యగ్నిహోత్రుని సాక్షిగఁ గైకొన్న యర్థాంగి నరణ్యముల పాలు చేయు నావంటి నిర్భాగ్యుఁడెందయిన నుండునే! నా సేవతప్ప నన్యమెఱుంగని సీతను, పితృవాక్పరిపాలనార్థమై యరణ్యమునకు బోవుతరి నన్నెడబాయఁజాలక నావెంటవచ్చిన సీతను, దండకారణ్యమున మాయాకురంగమైన మారీచుఁడు మమ్ము వంచించుటకు "హాలక్ష్మణా - సీతా"యని యఱచినప్పుడు నాకేమి యపాయము కలిగినదోయని విచారించి, నాసేమమరయుటకు లక్ష్మణునిఁబంపిన గాఢానురాగ హృదయయగు సీతను, లంకాపురమున దైత్యులెంతకష్టపెట్టినను, తన సతీత్వము నిలుపుకొనిన సాధ్వీ శిరోమణియగు సీతను, పరిపూర్ణ గర్భవతియగు సీతను, అక్కటా! అడవులుపాలుగావించితినికదా! హా! జనకరాజకుమారీ!

చ॥ జనకుని సత్యశాసనము • సంతసమేర్పడ దీర్పనెంచి, య
వ్వనములలోపలన్ దిరిగి • వచ్చితి మింకపయిన్ సుఖంబులన్
గనుచుఁ బ్రజాళి మెచ్చఁగను • క్ష్మాతలమేలుచు నిన్నుఁ గూడియుం
దుననుచుఁ దలంపఁగా నకట • తోయజసంభవుఁడిట్లు వ్రాసెఁగా.

నీయెడల నేనెంతనిర్దయ వహించితిని. హా! సీతా! పూతచరిత్రా!

చ॥ వనములయందు నిన్వదలి • వచ్చెడు వేళ సుమిత్రసూతి భూ
జనములనింద వాక్యములు • స్వాంతము నెల్లఁ గలంపఁగా నిటుల్
నిను విడనాడె రామజన • నేతయటంచును నీకుఁ జెప్పఁగా
మనమున నెట్టు గుందితివొ • మానిని! నేగతినుండ నేర్తుఁగా.

నాయట్టి నిర్భాగ్యునకు సతివై యుండుటచేతనే నీకిట్టిసంకటములు ప్రాప్తించుచున్నవి.

చ॥ మనుకుల వార్ధిపూర్ణశశి • మాన్యచరిత్రుఁడు రాఘవేశ్వరుం
డనిముదమంది నిన్ బరిణ • యంబును జేసెను గాక రాముఁ డీ
వనములయందె సంతతము • వాసము సేయఁగ నిన్నుఁ బంపు వా
డని తలపోయ డయ్యెను గ• దా! జనకుండు మనంబులోపలన్.

చ॥ అనఘుఁడు లక్ష్మణుండు నిను • నవ్వనభూమిని డించిరాఁగ, నే
మనుచుఁ దపించితో! మునుల • యాశ్రమభూమి నసింపఁ బోయితో
కనులను నీరు గార్చి నిజ • కాంతుఁడె యీగతి నన్నుఁ జేసెగా
యని తనువున్ దృజించితివొ • యంబుజ పత్రవిశాలలోచనా.

లక్ష్మ—అన్నయ్యా! ఈవెఱ్ఱియేమి! నానాటికి నీవు విచారసాగరమున మునిగిపోవు చుంటివే. నీకుఁ దెలియని ధర్మము లెందుఁ గలవు? నీవు సామాన్యుఁడవు గావు, జగంబు నెల్లెడల బ్రకాశించుచుంటివి. పరమాత్ముండవు. "రామా" యని నిన్ను నిరంతర భక్తిచేత బూజించు మహనీయులే పుత్రమిత్రకళత్రములపై భ్రాంతిని విడుచుచుండగా నీవిట్లు విచారించుటతగునా?

[అనుబంధము 20]

శ్రీరా—లక్ష్మణా! నాసర్వసౌఖ్యములకును నాలవాలము, నాభాగ్యరాసి, అయోధ్యానగర సామ్రాజ్యలక్ష్మి, అట్టిసీతను బాసితిని.

ఇఁక నేను జీవింపఁగలనా! నేనుగూడ సీతయరిగిన విపినములకే పోయి యచ్చటవసింతును.

తే॥ గీ॥ జనక పుత్రిక లేని రా • జ్యంబ వేల
భాగ్యభోగము లేల, యీ • బంధు లేల
ప్రాణమేటికి నింకనీ • రామునకును
నుగ్రవని కేగి మునివృత్తి • నుందుగాక.

లక్ష్మ—అన్నయ్యా సీత నరణ్యములకుఁ బంపవలదని తొలుత నే మెంతయో బ్రతిమాలి నీకుఁజెప్పితిమి. మావచనంబుల వినక నిష్కళంక చిత్తను, పరిపూర్ణ గర్భవతిని, అరణ్యములు పాలు. జేసితివి. ఇప్పుడు విచారించుచుంటివి, ఏమి సేయుదుము! విధికృతము నెవ్వరును తప్పింపఁజాలరు.

శ్రీరా—తమ్ముఁడా! సీత లోకాతీత సద్గుణవంతురాలనియు, సాధ్వీశిరోమణియనియు నకల్మషురాలనియు, నేనెఱుంగుదును. లోకనింద కోడి యిట్లు జేసితిని. దీనివలన సౌశీల్యాదిగుణములకు ద్విగుణీకృత కాంతివచ్చుటకు సంశయము లేదు. కాని, లక్ష్మణా! పాపచిత్తుఁడనైన నాచేఁ బరిత్యజింపఁబడిన యాభామ-అయ్యో! అరణ్యమున ఏ క్రూరజంతువులచేతను జంపఁబడక; లేక అకారణనిందనుభరింపఁజాలక తనువుపై రోసి ప్రాణములుత్యజింపక బ్రతికియుండినఁగదా! (చింతించును)

లక్ష్మ—అన్నయ్యా! ఊరడిల్లుము-ఆమెనీకు నాచేఁబంపిన సందేశము మఱచిపోయితివికాబోలు. జ్ఞప్తికిఁదెచ్చుచున్నాను వినుము.

సీ॥ రాతినాతిగఁజేయు • రమణీయమాపాద
జలజంబులకునమ • స్కారమనుము
తననింద బోగొట్టు • కొనుటకై యీసీత
జీవంబులీయ,సం • సిద్ధయనుము
ఈ రేడుజగములు • శ్రీరామమయముగా
చిత్తమం దెప్పుడీ • క్షింతుననుము

అపవాదని౯కబాసి • హాయిగాజనులెల్ల
హర్షింపసౌఖ్యంబు • లందుమనుము
తే॥ గీ॥ నిజము దేవుఁడెఱుంగును • నీరుపల్ల
మెఱుగు ననునట్టిమాట భా • వింపుమనుము
సీత సుగుణంబులనుబరీ • క్షించిపిదప
మహితకృపతోడ నేలుట • మంచిదనుము.

శ్రీరా—లక్ష్మణా! నీవుచెప్పినట్లు గుణవతియగునాసీత యరణ్యముననున్న తాపసాశ్రమములయందు సుఖముగనుండుననియే తలంచెదను.

ఉ॥ తారకసంఘమంతయును • ధారుణిఁ వ్రాలద! యా దినేశుఁడున్
దారినితప్పిపోడె; హిమ • ధాముఁడు శైత్యమువీడకుండు నా
ధారుణి వంతలన్ మునుఁగ • దా! జనకాత్మజపుత్రి సీతకున్
దారిమఱొక్కటైన నదు • కాననమం దుసురుల్ త్యజించినన్॥

లక్ష్మ—రామచంద్రా! నిశ్చయము. సుఖప్రసూతయై కుమారసహితముగఁగుశలియైయుండు నమ్మహాదేవిని నీవుసత్వరముగ వీక్షించి యానందమందగలవు.

తెరలో

అగ్రజా! శ్రీరామచంద్రా! వసిష్ఠభగవానులు అశ్వమేధయాగమును గూర్చిమరల సంధ్యాసమయమున హెచ్చరించినారు,

శ్రీరా—అవునవును-లక్ష్మణా! రావణునివధచే గలిగిన బ్రహ్మహత్యా పాతకము నివారించుకొనుట కశ్వమేధము సేయుమని వసిష్ఠుల వారుచెప్పియున్నారు. కాలనియమమునకు రేపే దీక్షాబద్ధుఁడ నయ్యెదను. అందులకుఁదగిన సన్నాహము సేయుమనిభరతునితోఁ జెప్పుము-ఇకనీకు నిద్రకు వేళయైనది. పొమ్ము,

లక్ష్మ—(నిష్క్రమించును.)

శ్రీరా—భార్యావియోగదుఃఖమునగూలినవారికి నిద్ర రాదుకదా! హా! తరుణీమణీ నిన్నుబాసిన నాటనుండియు నిద్రాహారములు నాకు దూరమైనవి. ఇక నీవియోగము చేత నేనెట్లు సహింతును.

ఉ॥ నీవుమహాపతివ్రతవు • నిర్మలధర్మవివేకశీల స
ద్భావము నీదుసొమ్ము జన • వంద్యను నిన్నిటు నేనె క్రూరదు
ర్భావముబూని ఘోరవన • రాసికిఁబంపి యఘంబుఁగొంటి, స
య్యో! వ్రవసితామణీ! యటమ • హోగ్రవనంబుల నెట్టులుంటివో.

పగలంతయు రాజకార్యములయందు ప్రవర్తించుచుండుటచేతగాని, అనుజులు నన్ననుసరించియుండి యేదోలోకాభిరామాయణముఁజెప్పుచుగాలయాపనము సేయుచుండుటచేతగాని, సీతంగూర్చిన చింతపైకిపొంగకలోనడంగియుండును. రాత్రులయందత్తలోదరి నాకన్నులకుఁగట్టినయట్టేయుండును. సూర్యభగవానుడుగూడ కాలక్రమమును దప్పియనుదినమును ద్వాంతముగనే యస్తమించుచున్నాడనితోచుచున్నది. ఓ ప్రభాకరా!

ఉ॥ నాకులకీర్తి నిల్పిన గు• ణాఢ్యను సీతనుగానకంపె, న
య్యో! కఠినాత్మకుం డితని • నొప్పఁగ జూడగ రాదటంచు నీ
వాకఠినుం దురాగ్రహము • నాత్మనుబూని క్రమంబు దప్పి య
స్తోకరయంబునం జనఁగ • జూతువె! నీవపరాబ్ధిగుంకఁగన్.

అదిగో: చంద్రుఁడుదయించి తన శీతకిరణ కాంతిని జగంబునెల్లెడలఁ బ్రకాశింపఁజేయుచున్నాడు.

తే॥ గీ॥ చంద్రుఁడుదయించి కాంతినిఁసాంద్రుఁడగుచు
నాముఖంబును బోలెడి • నాతిమిన్నఁ
బాసియున్నాడ వేలరా • భాగ్యహీన
యంచుఁగోపమునమదిని • గలంచుచుండె.

తే॥ గీ॥ చల్లదనమెంతొయిచ్చును • చంద్రుఁడనుచు
బలుకుచుందురు సతతంబుఁ • బ్రజలునిన్ను
జల్లదనమెచ్చటనులేదు • చంద్ర! నిన్ను
మింటఁజూచినంతనె నాకు • మంటలొదవె.

(సీతనుద్దేశించి) హా! సీతా! అరణ్యమున జీవములతో నుంటివా! కంటివా నందనోదయము! అరణ్యమున నీసంతానము నెవ్వరు సాకుచున్నారు నిన్నెవరు రక్షించుచున్నారు.

సీ॥ అర్ధాంగినాటచే • నరుదేరగావలె,
మాతోడనన్న న • మేయభక్తి
పావనంబైన గో • దావరీసైకత,
స్థలులఁజరించిన • సంతసంబు
లేడికై పోవు నా • జాడకై సౌమిత్రి,
బంపించి నిందించిన • భవ్యకరుణ
పవమానసూతికి • బహుదుఃఖమున నాడు,
బ్రకటించు మహితాను • రాగగంమ
తే॥ గీ॥ కనిఁడికోతలకోర్చి య • య్యసురుపురిని
నన్నుఁజూచెడు వాంఛఁబ్రా • ణములు మేన
దాల్చియుంచిన ప్రేమంబు • దరుణి మఱచి
కష్టములఁగూర్చితి నీకు • గానకంపి.

నీభక్తి-ప్రేమ-యనురాగము - కరుణ - పతిసేవాపరాయణత-నమ్రతసరసవాగ్రచన-హా! సీతా! మరపునకురావు.

మ॥ లలితామూల్య శశిప్రభామలదుకూ • లఁగ్రంధిస ధించి నీ
జలజాతాక్షినివచ్చినానిదిగో నీ • సంసేవఁజేయ ని
చ్చలు సంచుఁవచియింప గర్భవతితో • చానాయనన్ నేను,నా
వలుకుఁగాలించుచు లజ్జఁజూపెడుసతిన్ • బద్మాక్షి భావించెదన్.

శా॥ నీమోముఁ దిలకంబుదిద్ది దిటులఁ • వేంచేయుమీయంచు. న
న్నామోదంబునఁబిల్చి కస్తురిని హ • స్తాబ్జంబునంబెట్టి, యే
దీమోమంచును నవ్వుచున్ బలియుఁర్ధిఁ గాగిటఁదన్పు నా
శ్యామారత్నము నవ్వు చర్యలను నా • స్వాంతంబు నందించెదఁ.

మ॥ అనఘాత్మా! భవదీయ దివ్యపదసే • వాసక్తచిత్తంబు, స
జ్జనసాంగత్యము దర్పతత్పరత, వి • జ్ఞానంబు నాకెప్పుడుఁ
ఘనభూషావళి గావరంబశి కృపఁ • గాపాడవే రాఘవా
యని ప్రార్థించుచునుండు జానకిని న • య్యబ్జాక్షిఁ గీర్తించెదఁ.

అయ్యో! నాప్రియురాలి వియోగమునకు నాచిత్తమింక సైపక యున్నది. పరిచారికలెందఱున్నను స్నానానంతరమున నాపాదముల

పైటచెఱగున నీవేతుడిచితివి. ఏసమయంబున నాకేది కావలసివచ్చునో యని నిరంతరము నాచిత్తము ననుసరించి మెలంగితివి. ఆగర్భ శ్రీమంతుండగు జనకరాజర్షి కూతురవయ్యును, నాతో నరణ్యమునం గాపురంబొనర్చితివి. పాతివ్రత్య పరీక్షార్థమై యగ్నింద్రోసినను నాపై నాగ్రహింపక మన్నించినావు. అట్టి నిన్ను అయ్యో! విడిచి- మొండిప్రాణములు శరీరమున దాల్చియున్నాడ. హా! తలోదరీ! ఈజన్మమున నిన్ను మరల వీక్షింపంగలుగుదునా! సుఖప్రసూతవై కుమారసహితవగు నిన్ను దిలకించి యానందమందుదునా! ఇక నిన్నుం జూడకయున్న నేను జీవించుటకల్ల. హా! విశ్వామిత్రమహర్షివర్యా! హా! మామా జనక నృపాలా! హా! లంకాధిపా! విభీషణా! హా! మిత్రమా! సుగ్రీవా! హా! మదీయాజ్ఞాపరిపాలనా విధానధౌరేయా! ఆంజనేయా! మీరందఱును నెక్కడనున్నారు. నాసీతను నాకప్పగించి నాప్రాణములు నిలుపుడు. హా! సీతా! రామమయజీవితా! పావకవసిష్ఠారుంధతీ యనసూయ సన్నుత ప్రశస్తసుగుణశీలా! జనక రాజకుమారీ! సీతా- సీతా- నీవులేని రాముని జీవితము నిరర్థకము. సాకేతనగరము జీర్ణారణ్యముగ నున్నది. జానకీ! రమ్ము. ఇదిగో రాముడు- కఠినచిత్తుడని యాగ్రహింపకుము. హా! జానకీ! రావా! రావా! (మూర్ఛిల్లును.)

(అవనిక పడును.)

ఇది చతుర్థాంకము.

---



# లవకుశ నాటకము

## పంచమాంకము.

:— రంగము (అరణ్యప్రదేశము:—ప్రవేశము :—జనకుడు)

జన—(తనలో) ఆహా! పురాకృత కర్మపరిపాకమును నెవ్వరు దాటఁ జాలరు కదా! కాకున్న పావనమైన యజ్ఞవేదికయం దుదయించిన సాక్షాదిందిరాదేవియగు సీతకేమి! ఇట్టి యిక్కట్టులేమి! ధరాభార నివారణార్థమై ప్రభాకరవంశంబున జన్మించిన విష్ణుం డగు శ్రీరామ చంద్రునకు జానకినొసంగితిని కదాయని యానందించితిని గాని, కట్టా! బ్రహ్మ యామెకొఁసట నిరంతరము వనవాసమును సేయుచుండుమని వ్రాసిన వ్రాత నెఱుంగనైతిని కదా! మహారాజునయ్యు, వైరాగ్య చిత్తుడనై, తపోవృత్తినున్న నాకే సీతకు గలిగిన యిడుమలఁదలచిన దుఃఖము సముద్రమువలె! పొంగి పొరలుచుండ, సామాన్య మానవుల గూర్చి చెప్పనేల!

తే. గీ॥ ఖండ శర్కరకంటె ద్రా • క్షారసంబు
కంటె, నమృతంబుకంటె, గం • గాజలంబు
కంటె మిగుల నధికమగుచు • గ్రాలునట్టి
కడుపు వంట తెపికి సాటి • కలదె జగతి.

అక్కటా! నేనెట్లువిచారమునుమాని ధైర్యచిత్తుడను కాగలను? న్యాయాన్యాయవిచారణ పటిష్ఠుడు- నిరంతరదయామయుడు. నిఖిల ధర్మసంవేదియగు శ్రీరామచంద్రుడు అయ్యో! నాపుత్రికయం దింతనిర్దా

క్షిణ్యమువహించి, భయంకర కాంతార వాటి కంపినందులకు నేనేమని విచారింతును. పదునాల్గు జగములచే సాధ్వియని వినుతిఁ గాంచినసీతను; గుణాగుణములు తాను స్వయముగనరసినసీతను; శ్రీరాముడు లేని నింద నా మెప్పై బెట్టి పరిపూర్ణగర్భవతిని నరణ్యములకుఁ బంపినందుకు శోకించెదను మహారణ్యములయందు సీత యేభంగి నిడుములఁ బడుచున్నదో! నా కుమారీమణిని నాతపః ఫలరాశిని, నాభాగ్యముల పంటనుఁ, నావంశవర్ధనిని సీతను- నేనీ జన్మమున గాంచఁ గలుగుదునా?

సీ॥ యజ్ఞవాటికయందు • నవతారమందినాఁ
కాత్మజాతయయిన • యాదిలక్ష్మి
హరువిల్లు విఱువంగ • హరియయినశ్రీరాము
పాణిగ్రహించిన • పద్మగంధి
అనసూయ మొదలైన • ఘన సాధ్వీమణులచే
గుణశీల యనినుతి • గన్నకాంత
అసురాట్టహాసంబు • కలఁజెడినందక
కులసతీత్వము నిల్పు • కొన్నసాధ్వి

తే॥ గీ॥ భువనవిఖ్యాత మాసీత • భూరిభీక
రాటవులయందు నెట్టి దు • ర్గతులనందు
చున్నదో! కుమారీమణిఁ • జూచుభాగ్య
మేను నోచియుంటినొ లేదొ • యెఱుగనైతి.

మ॥ గిరిజాభామలు నేస్తకత్తియలుగా • గీర్వాణకాంతామణుల్
వరదాసీనికరంబుగా త్రిభువన • వ్రాతంబు క్రీడామనో
హరదేశంబుగ లోకముల్ దనుపు న• య్యంభోజపత్రాక్షిఁ యిం
దిర మాసీతను భూమిజాతనిఁ కన • ర్థిన్ జూతునో చూడనో.

కానిమ్ము. మాసీత ప్రాచేతసులు యాశ్రమముననున్నదని కర్ణాకర్ణికగా వింటిని. భగవంతుఁడు నాకనుకూలుఁడగుఁగాక!

(నిష్క్రమించును)

(తెరలో)

ప్రియంవదా! ప్రియంవదా! మనమున్న వెపునకొక శార్దూలము వచ్చుచున్నది. అయ్యో! మనలను రక్షించువారు లేరా!

(లవకుశులు—తొందరగా బ్రవేశింతురు)

లవు— (ఎదుటఁ జూచుచు) తాపసాంగనలారా! భయమందకుఁడు. శార్దూలము మీరున్న వెపునకు రాఁజాలదు. లవకుశులు మృగయా విహారమునకై యరణ్యమునుఁ బ్రవేశించినారు. (కుశునిజూచి) అన్నయ్యా! మనము సత్వరముగఁబోయి యా భీకర మృగమును వధించి వత్తము. రమ్ము. రమ్ము.

కుశు—వధింప నేల?

లవు—అవునవును! మఱచితిని. దానిఁబట్టుకొనిపోయి మన యమ్మకుఁ జూపి యిదివఱకుఁ బట్టుకొనియుంచిన శార్దూలముతోఁబాటు కట్టి వేయుదము. రమ్ము- (నిష్క్రమించి వెంటనే బంధింపఁబడిన మృగముతో - ప్రవేశించును)

(తెరలో) లవకుశులారా! నేడు మమ్ము రక్షించిరి. మీతల్లి కడుపు చలవగా వేయేండ్లు వర్ధిల్లుఁడు.

(జనకుఁడు - ప్రవేశించును).

జన—(తనలో) ఈప్రాంతమున నెవరో స్త్రీలు శార్దూలమునకు భయమంది కేకవేయగా, నాకంటికి గనిపించిన శార్దూలమును దరుముచువచ్చితిని. ఏదీ! ఆశార్దూలము. కనిపించదే. (ఎదుటఁజూచి) ఇదిగో! ఈశార్దూల మీ మునికుమారునిచేత బంధింపఁబడినది. ఔరా! ఆశ్చర్యము! ఇట్టి సాహసము మునికుమారుల యందు మున్నెప్పుడును జూచియుండలేదు. (లవకుశులను జూచి) మునికుమారులారా! గృహమునఁ బెంపఁబడు శునకమనుకొంటిరా యేమి ఈశార్దూలము - చాలుచాలు దీనిని నేను తఱుముకొని వచ్చితిని. విడువుడు నాశరంబుచే దీనినిగూల్చెద.

కుశు—మీరెవరు?

తే॥ గీ॥ భీకరాటవులందు ని • ర్భీతిఁబూని
సంచరించుచు నుండెడు • శౌర్యధనుల
మైనమాముందు పిఱికి వా • క్యంబులాడ
దగదుపొమ్ము పొమ్మింక నీ • దారిబట్టి.

మృగయావిహారమున మే మారితేఱినవార మే.

లవ—స్వామీ! మీరెవరు! మాచేబంధింపఁబడిన మృగమును ఱంపెద నని పలుకుచున్నారు. మీరు వర్ణనాతీత శౌర్యముకలవారుగా దోచుచున్నారు.

జన—(స్వగతము) వీం నిర్భయపుమాటలు నాకాశ్చర్యమును, నానంద మునుఁగూడ గలుగఁజేయుచున్నవి. వీరు మునికుమారు లే యైయుందురా! అట్లయిన వీరికిట్టి ధైర్యసాహసము లలవడుట యెట్లు. (ప్రకాశముగా,) తాపసకుమారులారా! వేటాడుట, యుద్ధముసేయుట క్షత్రియుల ధనము. అదియుంగాక స్త్రీల యార్తారవము వినిచే నీ మృగమును గూల్పనెంచి తెలుపుచు నాక బాణమును బ్రయోగించితిని. కొంచెముగా నాదెబ్బతగిలి యుండుటచే మీరుదీనిని బట్టగలిగితిం. అయిననుగ్రూరమృగమ గుటచే నమ్మరాదు- విడువుడు.

లవు—వేటయు- యుద్ధమును క్షత్రియులధనమా? సరిసరి. అట్లయిదన మేమును వీరక్షత్రియవంశ ప్రావిర్భూత శూరశిఖామణులమే, నీబాణము కొంచెముగాదగులుటచే మేమాపితిమని పలుకు చుంటివా! నీపలుకులు క్రిందపడినను పైనుంటిననియే పలుకుచు న్నట్లున్నవి. చూడుము, దీనిని మాపౌరుషముచేత నాపితిమో, లేక నీదెబ్బతగులుటచేత నాపితిమో. (కొంచెము విడువగా పోవనెంచును - లవుడు చెవులుపట్టుకొని నిలబెట్టును)·

కురు—ఏమయ్యా! ఇప్పుడేమందువు.

జన—మీరు బాలకులైనను మాటలయందు మిగుల నేర్పరులవలె నున్నారే!

లవు—మాటలయందే కాదు. పోటుతనమునగూడ.

జన—మీరీమృగమును విడిచెదరా లేదా!

కుశు—ఏమయ్యా! నీశౌర్యము! మాచేతజిక్కి చచ్చినట్లున్నదానిని మరల జంపెదనని పలుకుచున్నావు.

జన-ఇదిగో! నేను బాణమును వేయుచున్నాను (శరప్రయోగము సేయును)

కుశు—(బాణమును ఖండించును)

జన—(ఆశ్చర్యముతోఁ జూచుచు)

లవ—ఏమయ్యా! తెల్లగుడ్లు వేసినావు - నీబాణమేమయినది.

జన—(కోపముతోఁ జూచును)

లవ—కోపమునడఁచుకొమ్ము. సార్థకము లేదు (కుశునిఁ జూచి) అన్నయ్యా! మనకీతనితో వృథాప్రసంగమెందులకు మనమీ మృగమును దీసికొని యాశ్రమమునకుఁ బోవుదము రమ్ము

(ఇరువురును నిష్క్రమింతురు)

జన—(స్వగతము) ఆహా! సుందరాకారులైన యీ కుమారులెవ్వరు! తాపసబాలకులే యైయుందురా! తాపసులలో నింత సౌందర్యము, ఇంత తేజము, ఇట్టిధైర్యము, సాహసము, మృదుమధుర వాక్చమత్కారము, మున్నెన్నడైన జూచియుంటినా! ముఖలక్షణములఁ జూడ క్షత్రియబాలకులవలె దోచుచున్నారు. కంతుజయంతులు అశ్వనీకుమారులు ఈరూపముల నీభూమి నవతరించినవిధము తోచుచున్నది, భళా! వీరిరూపములు నాకన్నుల యెదుట జిత్రింపఁబడినవే. వారీస్థలమును బాసిపోయినను ఎదుటనున్నట్లేయున్నది, అదియొకవిధమైన యనురాగముచే నాహృదయము పూరింపఁబడినది (ఇంచుక యూరకుండి!) మాజానకి గాంచియుండదు కదా! ఏమో! నాకట్టియనుమానము కలుగుచున్నది. అయ్యో! నాపిచ్చిభ్రాంతికేమందును. ఘోరారణ్యములయందున్న మాసీతమ్మతల్లి సుఖప్రసూతయై యిట్టి నందనోదయభాగ్యమందుట నేను జూతునా! నేనట్టిభాగ్యము నోచియుంటినా! (ఆలోచించి) ఆదిశక్తి, పరంజ్యోతి, యగు

సీతకు భూమిజాతకు, త్రిభువన విఖ్యాతకెట్టి యాపదయును గలిగి యుండదు. ఆమెసుఖియైయున్నదనియే నానిశ్చయము. ఇంచుక కాలమావటవిటపిక్రింద విశ్రమించి నెమ్మదిగా వాల్మీకాశ్రమమున కేగెదగాక.

(నిష్క్రమించును.)

రంగము:-- [వాల్మీకాశ్రమ సమీపారణ్యము- ప్రవేశము- లవుఁడు గాలవుడు-]

లవు—గాలవా! ఏమికారణముచేతనోగాని క్రూరమృగములు మన యాశ్రమప్రాంతమునకు రెండు మూడు రోజులనుంచి యెక్కువగ వచ్చుచున్నవి. నేఁడీ యరణ్యమునఁ జరించి వానినెల్ల నిర్మూలము జేయవలయును.

గాల—ఇందుకా నీవు నన్నిక్కడకుఁ గొనితెచ్చితివి. ఓయీ! నన్ను బ్రతుకనీయనట్లున్నావు.

లవు—అట్లు బలికెద వేమి?

గాల—ఏమిచెప్పను! వానింజూచినతోడనె నాకు పైప్రాణములు పైపోవును. లవా! నామాటవినుము: వాల్మీకులవారుగూడకి నిన్నెట్టి సాహసకార్యములను చేయవలదని చెప్పి వరుణ లోకమున కేగినారు. దీనివలన నేహానియైన సంభవింపగలదు, ఏవో నాలుగుపాఠములు చదువుకొని వైదికవృత్తినిఁ గాలము గడపఁ జూచు మనకు సాహసకృత్యములతో నేమిపనియున్నది?

లవు—మిత్రమా! నీవెప్పుడును నిట్టి పిఱికిమాటలనే పలుకుచుందువు. శౌర్యసాహసములకుఁ గులముతోఁ బనిలేదు. మృగసంహార విచిత్రమును. నీవు చూచుచుండుము. నీకేమియు భయము లేదు.

గాల— మాటలకేమి? ఎన్నియైనఁ జెప్పవచ్చును. ఏఘాతుక మృగమైన గుటుక్కుమని నన్నునోట్లో బడవేసికొని యప్పడమువలె నమలిన పిదప నీవు చేయునదేమున్నది. బాబూ! నాతండ్రికి

నేనేకపుత్రుఁడను. ఏమో రెండక్షరములువచ్చునని వాల్మీకుల వారికి మాతండ్రి యప్పగించినాడు.

లవు— సఖుడా నీకింత భయమేమి?

(తెరలో కలకలము)

లవు—ఉండు-ఉండు. ఏదియోశబ్దము వినవచ్చుచున్నది. (ఎదుటఁ జూచి) అటుఁజూడుము. మనవైపునకొక గుఱ్ఱము వచ్చుచున్నది. దాని పిఱుఁద సైన్యముగూడ నున్నవిధము తోఁచుచున్నది.

(అంత గుఱ్ఱము వచ్చును.)

లవు—(హయమును బరికించి) ఓహో! ఇట్టి సుందరమగు హయమును మన మెచ్చటను జూడలేదు. ఏమిది! దీని మెడయందేదియో కట్టఁబడియున్నది. (గుఱ్ఱమును బట్టుకొని) ఇది బిరుదపట్టము. సఖుఁడా! చూచితివా!

తే॥ గీ॥ సవనహయమిద్ది, శ్రీరామ • చంద్రుచేత
విడువఁబడె రక్షకుండౌచు • వెంటవచ్చె
నతని తమ్ముఁడు శత్రుఘ్ను • డలఘుబలుఁడు
శూరులుండినఁ బట్టుఁడు • సొంపుమీఱ.

గాల—లవా! ఇక వదలివేయుము. నెమ్మదిగా మన దారిని మనము పోవుదము.

లవు—మంచిమాటఁ జెప్పితివి.

తే॥ గీ॥ స్వస్తివాక్యముల్ చదువుచుఁ • బాలధనము
గల్గినట్టి వారలఁజేరి • కాలమెట్లొ
వెళ్లదీయగ నెంతురు • పృథ్వీసురులు
గాని సాహసంబదియేమొ • కానరాదు.

ధైర్యమేలక్ష్మి. అట్టి ధైర్యమునకు మనము దూరమైనచో మనము చేయఁ గలిగిన పనియావంతయు లేదు. గాలవా! శూరులెవరైన నున్నచోఁ బట్టుడనికదా బిరుదపట్ట మీహయంబునకుఁ గట్టఁబడినది. నేను శూరుండను. కావున నేను దీనిని బంధించెదను. ఎవ్వరడ్డము

వచ్చెదరో చూచెదను. (బంధించి త్రాటితో నొకచెట్టునకు గట్టి వేయును.)

గాల—ఈహయమొక్కటియే వచ్చినదని తలంచుచుంటివా యేమి!

లవు—ఎంతమంది యుండిన నేమి!

మ॥ పటుశక్తిఁ సవనాశ్వరాజమును నే • బంధించినానిప్పు డు
త్కటశక్తిఁ విడిపించుకోఁదలఁచి యా • కామారియే యుగ్రుఁడై
యిటకేతెంచునుగాక భీతివడ నా • కేలా! మహాధైర్యముఁ
జటులాస్త్ర ప్రభయుఁ మదీయధనమై • క్ష్మామండలిన్ రాజిలుఁ.

నీవేమియు భయమందవలదు. నాప్రక్క నిలిచియుండుము.

(సేనాధిపతి సైనికులతోఁ బ్రవేశించును.)

సేనా— (లవునిఁజూచి) ఎవరయ్యా! ఈయశ్వమును గట్టివేసినది.

లవు— నేను

సేనా— ఎందులకుఁ గట్టితివి.

లవు— బిరుదపట్టమును జూచి

సేనా— (తనలో) ఈ బాలుఁడు వేషమును జూడ మునివటువుగను ముఖలక్షణములు చూడ క్షత్రియ కుమారునిగను గనుపట్టుచున్నాఁడు. (ప్రకాశముగా) మునికుమారా! సాహసకార్యము చేసితివి, ఇక గుఱ్ఱమును విడువుము (గుఱ్ఱమున్న చెట్టు యొద్దకుఁ బోవును)

లవు— అడ్డము రాక ప్రాణములుండఁ జూచుకొనుము. వచ్చినదారిని బొమ్ము. మాటలచే నాచే బంధింపబడిన గుఱ్ఱము వచ్చునని తలంచితివా యేమి?

సేనా— బ్రాహ్మణుఁడవగుటనీ బాల్యచాపల్యమునకు నవ్వువచ్చుచున్నది. విశేషము సాహసము చేయవలదు. ఇది యెవరి యజ్ఞాశ్వమను కొంటివి?

లవు— అంతయు జూచినాను. వీరుడను గనుక బట్టినాను.

సేనా— ఓహో నీవు మిగుల గడుసువాడవే

లవు— నాగడుసుదనము మాటలలోనా నీవు చూచుట? రణముఖంబునఁ జూడఁ గలయును.

సేనా— ఆహాహా! బ్రాహ్మణుఁడవు. అందులో ముక్కుపచ్చలారని పసికూనవు! నీతోడనా మాకు యుద్ధము! నేనంత కరుణలేని వాడననుకొంటివా?

లవు— పాపము కరుణగలవాడవే. బ్రాహ్మణులంత చులకనగ గనిపించుచున్నారే! పరశురాముని మాట వినలేదా యేమి?

సేనా—వినకేమి! ఆపరశురాముని గర్వమడఁచిన రాముఁడే యీయశ్వము విడిచినాడు.

లవు—అట్లయిన మఱియు మంచిదే. నీవుపోయి మీరాజును దీసికొని రమ్ము.

సేనా—ఇక నీయెడల మే మశ్రద్ధ సేయరాదు. (సైనికులను జూచి) సైనికులారా! ఈ గుఱ్ఱమునువిప్పి వదలివేయుఁడు.

లవు—అట్లనా! ఇదిగో చూడుము (శరప్రయోగము సేయగా సేనాధిపతియు సైనికులు నేలఁ బడుదురు.)

(తొందరగా శత్రుఘ్నుఁడు—ప్రవేశించును.)

శత్రు—(కోపముతో లవునిఁజూచి) ఈయశ్వమును బంధించి మా సైనికులను జికాకు పఱచినది నీవేనా;

లవు—అవును. అంతతీవ్రముగఁ జూచుచు మాటలాడెదవేమి! చంపుదువా యేమి!

శత్రు—గుఱ్ఱమును విడిచిన నీజోలిమాకేల?

లవు—గుఱ్ఱమునా! రుద్రుడువచ్చినను విడువను.

శత్రు—ఔరా! ఈ నిర్భయత్వము! ఈ ధైర్యము అద్భుతము గలిగించుచున్నవి. బ్రహ్మణులకింత శౌర్యసాహసము లెక్కడివి (ప్రకాశముగా) మునిబాలకా!

మ॥ మునిబాలుండవు శౌర్యమేమి తెలియున్ • భూపాలచంద్రుండు రాముని యజ్ఞాశ్వము దీనిఁబట్టుటకునై • ముక్కంటియైనన్ మనం

బున నూహించునె; యిట్లు జేసితివిగా • భూమీసురుం డిట్టి చే
తనుగావించెనటంచు విన్ననగదే • ధాత్రీతలంబెల్లెడన్.

లవు—శౌర్యము లేనివారినిఁ జూచిన నవ్వుదురుగాని శౌర్యవంతులను నెవ్వరు నవ్వుదురయ్యా! ఈ యనవసరమైన మాటలెందు కయ్యా!

చ॥ క్రతుతురగంబుఁ బట్టితిన • ఖండపరాక్రమ మంటచేత, నా
సితకరవాళివచ్చినను • జెందభయంబునొకింత; సంగర
క్షితిని భవత్పరాక్రమము • జెచ్చెరజూపి హయంబుగొమ్ము; ఈ
వితమునబల్కెదేల యవి • వేకులరీతిని నీవ్రుభూపతీ !

శత్రు—నీవు మాటలయందు జంకుట లేదే

(అనుబంధము—22.)

లవు—మాటలయందే కాదు పోటుతనంబునఁగూడ నట్లేయనితలంపుము.

శత్రు—మునిబాలకా! తాపసకుటీరంబులయందు వైదికవిద్యల నభ్యసించు మీకు క్షత్రియులతో గలహమున కేమి పనియున్నది. యుద్ధమంటివే అది యేమనుకొంటివి.

సీ॥ భయముఁగల్గించుని • భసమూజములుగాని
చనువీయగ గురంగ • సమితికాదు.
అగ్నికీలలజిమ్ము • నస్త్రసంతతిగాని
పరమేశుఁగొల్చుపు • ష్పములుగావు
వాహినివైపాలు • భయదరక్తమెకాని
ప్రీతిధరింప వి • భూతికాదు
శౌర్యవంతులమేటి • సాహసార్భటిగాని
కోర్కెమైవిన వేద • ఘోషకాదు.

తే॥ గీ॥ సమరమా! మునివటులకు • జాలుఁ జాలు
వినిన నవ్వరే! యిట్లుఁ ని • ర్భీతిఁబూని
పలుకుదే? నృపాలురముందు • బాలకా? గృ
హంబు జేరుమా? మాయజ్ఞ • హయము విడిచి.

లవు—ఇవియా! నీవు చెప్పుమాటలు! అంతమాత్రమునకే భయమునం దుదు ననుకొంటివా యేమి! మేము మాటలచేత నావలకు దాటువారముగాము. యుద్ధమేమో మాకును దెలియును,

తే॥ గీ॥ విమలదేశాభిమానంబు • బృథ్విసురుల
పైనభక్తి ధర్మంబున • భవ్యసక్తి
సమరమందునశక్తి మా • జనని మాకు
నుగ్గుపాలతోఁబెట్టెనో • యుర్విఁ బేడ

శత్రు—(తనలో) ఈ కుమారునిమాటలు నమృతప్రవాహముగనున్నవి మాటలచేతనే హయమునుగొనిపోవలయును. (ప్రకాశముగా.

ఉ॥ బాలకాక! నీవుభూపతుల • భంగినెఱుంగవొకింతయేని, యా
భీలరాత్రమక్రములు • భితినిఁజిత్తమునుండిదోలి నే
డాలము సేయనుంటివి, హ • యంబునునీవిధిఁగట్టివైచి, యా
ఫాలవిలోచనుండయిన • భాసురశక్తిని నన్నుగెల్చునే?

లవు—ఎక్కడనో కైలాసమువనున్న శంకరునిమాటయెందుకు? ఎదుట నున్న నన్నుగెల్చిహయమును దీసికొనిపొమ్ము. నీశక్తిజూతును.

శత్రు—కుమారా! నీచిన్నతనపుమాటల విడువుము. ఈయశ్వమును నీకుఁ దెలియకబంధించితివి. ఇంకవిడిచిపుచ్చినాతో నగరంబునకు రమ్ము. నీకశ్వముకావలసియున్నచో మఱియొక దానినిచ్చెదను. మారాజేంద్రుఁడు చేయుచున్న యజ్ఞమహోత్సవమును జూచె దవుగాక! యజ్ఞదినములన్నియు నక్కడనేయుండి నవరసాన్న పాయస భక్ష్యభోజ్యంబులు గుడుపవచ్చును. ఇదియుంగాక!

మ॥ కరిసంఘంబులొ మేల్హయంబులొ మహా • గ్రామంబులో రూకలో
వరమాణిక్యపుహారసంచయములో • వస్త్రంబులోభూములో
జిరమోదంబునఁగోరుకొమ్మొసఁగెదక • జేకొంచు నీవింక నీ
తురగశ్రేష్ఠమువీడుమా చ నెదఁ దో • డ్తో! నాపురిజేరఁగన్,

లవు—నీవు దాతవుగనుక నిచ్చెదవు, నీదానము స్వీకరించుట కిచ్చుట నెవ్వరును సిద్ధముగలేరు. లంచమునిచ్చి హయముగొనిపోవనెం

చుట నీవంటి యుత్తమక్షత్రియవీరునకుఁ దగదు, అవియిచ్చెద,
నివి యిచ్చెదనని పలుకుచుంటివి. ఇవియన్నియు మాకేల!

సీ॥ వనఫలంబులమెక్కు • ముని కుమారులుమాకు
సరసరసాన్నభ • క్ష్యంబులేల
వల్కలంబులగట్టి • కులుకుచుండెడుమాకు
బంగారు జల్తారు • బట్టలేల
మునికుటీరములందు • మురియుచుండెడుమాకు
దివ్యమాణిక్య మం • దిరములేల
ఘనతపోవృత్తిని • వనులనుండెడుమాకు
బహుదుఃఖయుత పుర • వాసమేల

తే॥ గీ॥ దేహమందున బలమును • దివ్యమాత
పోబలము గురు బలమును • బొలుచుచున్న
మాకుఁగరులేల! హయలేల! • మంచిరథము
లేల! యివియన్నిమీకేను • మీ! నృపాల,

కావున నీవెట్టిమాటలఁ జాలించి - శౌర్యమున్నచో గుణమును
విడిపించుకొనుము - లేదేని వచ్చినదారినిఁ బట్టుము.

శత్రు—మునిబాలకా! నీమోముదిలకింప ముద్దువచ్చుచున్నది. నీమృదు
మధుర వాక్యములఁజూడ, ననురాగ మొదవుచున్నది, నీబాల్య
చేష్టలఁ జూడ నానందమగుచున్నది. అట్టినీపై శస్త్రప్రయోగము
సేయుటకుఁ జేతులాడునా! నామాటవినుము,

(అనుబంధము 23)

లవు—మాటల పసఁజూపవలదని నేను ముందే చెప్పియుంటిని. నీవిట్లు
పల్కుటంజేసి నిన్ను శౌర్యహీనునిగాఁ దలంచుచున్నాను.

ఉ॥ ధీరత లేదు; వీడువన • దేశనివాసి; భయంకరాజిలో
బోరునోలేదోయించు మదిఁ • బొందఁగ బోకుము శంకయింతయుఁ
బోరును గోరియేయిటులు • బొందుగ నశ్వము బట్టికట్టి, నే
వీరుఁడనంచు బల్కుచును • విల్లు కరంబునఁదాల్చి నిల్చితిన్.

శత్రు—బాలకా! చెడిపోవుదువుసుమా! నామాటవినుము.

లవు—పౌరుషము లేని పలుకులఁ బలుకకుము.

శత్రు—(క్రోధముతో) ఆ! ఏమీ! ఇంతవఱకును బాలకుండనియు బ్రాహ్మణకుమారుండవనియు సైచితి. ఇంకనీవు తల్లికిలేని వాఁడవే (శరప్రయోగము సేయును).

లవు—(శరమును ఖండించి) చూచితివా నీశరము! ఏమైనది!

శత్రు—(తనలో) ఈతని శరలాఘవ మద్భుతముగానున్నది. ఈతని యెడల నుపేక్షింపరాదు. ఇదిగో! ఈబాణము కాచుకొమ్ము.

(ఇరువురను నొకరిపై నొకరు శరప్రయోగము జేసికొనుచు యుద్ధము సేయుదురు. లవుఁడు మూర్ఛిల్లును.)

తెరవాలును.

రంగము— [పర్ణశాలయందు-సీత ప్రవేశించును]

సీత—దీర్ఘతర సత్రయాగమును దిలకింపఁ బోయిన వాల్మీకి మునీంద్రుఁడింకను రాడయ్యె. ఏనాటికి శ్రీరామచంద్రమూర్తికి పై ననుగ్రహమువచ్చునో నన్ను జూచు ప్రతిమునీంద్రుఁడును నీవు త్వరలో నేశుభమును బడయగలవని చెప్పుచుండును. కాని ఈ నిర్భాగ్యురాలి కట్టిది ప్రాప్తించుటయే లేదు. నిర్మల యశంబునకుఁ గారణంబును, సకలాభీష్టఫలప్రదంబును, దుఃఖ నివారణంబును, సజ్జనస్తవనీయమును, మోక్షసామ్రాజ్యసౌధా రోహణమునకు సోపానమును నగు శ్రీరామ పదకమల సేవకు దూరమై నేనెట్లు జీవింతును.

సీ॥ ఆలింపవదియేల • యాశ్రమంబుల నిట్లు,
గాలంబుగడుపు నా • ఘనశ్రమంబు
యరయరావదియేల • గురుకటాక్షముబూని,
తన్వంగియైన సీ • తాపరిస్థితి
జను దేరవదియేల • సంతసంబునఁ జూడ,
తరణివంశాబ్ధి వ • ర్ధనుల సుతుల
చెవిఁ జేర్చవదియేల • శ్రీరామయని యెప్డు,
నర్థాంగిపెట్టు దీ • నారవంబు

తే॥ గీ॥ యింతపంతమా కోపమా • యింతి నేచ
ధర్మమా నాదుకర్మమా • మర్మమేమి
భద్రికారుణ్యగుణధామ • భవవిరామ
రామ జితకామ జగదభి • రామనామ,

దేవా నేను నీవిషయంబున నిట్లు పలుకు చుందునుగాని నా చిత్తశుద్ధి నీవెరింగి యున్నవాడవగుటచే, మద్వియోగమునకు నీవు గూడ వగచుచునే యుందువని తలంచెదను.

మ॥ జలదశ్యామల వర్ణముఁ సతతమా • సన్మౌని సంసేవ్యముఁ
జలజాతోద్భవశంక రాదినుతముఁ • భక్తార్తి విధ్వంసము
జ్వలమాణిక్య కిరీటకుండల విరా • జన్నీల సంఘాతకుం
తల విభ్రాజిత పూర్ణచంద్రసమవ • క్త్రంబెప్డు వీక్షింతునో.

చ॥ జగములకెల్ల మూలమయి • సంతతమిష్ట ఫలప్రదంబునై
నిగమ విచారగమ్యమయి • నీళగశార్చితమై యశేష యో
గిగణ హృదబ్జవాసమయి • కీర్తిదమై రమకాశ్రయంబునై
నగపు త్వదీయపాదయుగ • మే దిలకించుట యెప్డు రాఘవా?

(ప్రవేశము గాలవుడు)

గాల—అమ్మా! సీతాదేవి! నేడు లవుఁడును నేనును నరణ్యప్రాంతమున విహరించుచుండఁగా నొక సవనహయ మయ్యెడకు వచ్చినది. దానిని బంధింపవలదని యెంత చెప్పినను నీకుమారుఁడు వినక పట్టి చెట్టునకుఁ గట్టినాఁడు. గుఱ్ఱము వెంటవచ్చిన యెవ్వరో రాజు లవుని ఘోరశరంబులచే మూర్ఛిల్లఁజేసి తనరథముపైఁ బెట్టుకొని పోవుచున్నాఁడు కర్తవ్యమూహింపుము.

(నిష్క్రమించును.) (అనుబంధము 24)

సీత—హా! లవకుమారా! (మూర్ఛిల్లి లేచి) హా! కుమారా! దావక జ్వాలల చందమున హృదయమును దహించి వేయుచున్న పతి వియోగమునకుఁ దోడు-నాకు బుత్రవియోగముగూడ దటస్థించినదా. అక్కటా! నేను దీనినెట్లు భరింతును! నాయనా అరణ్యములందున్న మన కా మఖవాజితో నేమి పనివచ్చినది!

అక్కటా! పూర్ణ నక్షపాకర మండలంబును ధిక్కరించునీముఖమువీక్షించినంతనే యెట్టివారైనను ముద్దుబెట్టుకొందురే అట్టియెడల నీపై దారుణ శర ప్రయోగము సేయుటకు వానిచిత్త మెట్లుసమ్మతించినది. అయ్యో! పూర్వాకృత పాపమువలన భర్తచే విడువఁబడి ఘోర కాంతారమున నున్నను మిమ్ముఁలఁజూచుకొని కొంతవరకు నాశోకము మ్రింగియుంటిని. నీముద్దుముచ్చటల నెట్లుమఱతును. అనుదినంబున నరణ్యములకేగి నాకుఫలపుష్పముల దెచ్చియిచ్చు నీప్రేమ నెట్లుమరతును. ఒక్కత్రుటికాలమయినను విడిచి యెఱుగని నీయన్న నెట్లువిడచితివి. నీతండ్రిచేయుగా రాబంబుజూడవైతివి అవ్వలకు నీముద్దుముచ్చటల జూపవైతివి. తనయనంతరము మిథిలానగరాజ్యమునకు సీతసంతానమే యాధిపత్యమువహించునని సంతోషించు మాతాతయగు జనకరాజు మొగమైనను జూడలేదు. తండ్రీ! ఇంతలోనే నీకు నూతేండ్లునిండినవా దుర్భరంబైన యీశోకము నెట్లుభరంతును. నేనుమిమ్ముఁలగంటి ననువార్త శ్రీరామచంద్ర నకుఁ దెలియకపోదనియు, నప్పుడు గుమారసహితనగు నన్నెట్లో నగరంబునకు దోడ్కొనిపోవక మానడనియు గంపంత యాశతోనుంటిని నాయాశవ్యర్థము చేసితివా! హా కుమారా చారుశారదపూర్ణమాచంద్రఁ వదనాపాపిచేత సాంతేవాసీ! లవా! హానాధా! రామచంద్రా! నీదీనావస్థ జూడుము.తనయుని రక్షింపుము. రామా! రామా! జగధభిరామా!

(మూర్ఛిల్లును)

(కుశుఁడు ప్రవేశించును)

కుశు—ఏమిది! ఆశ్రమము దీపికలేనిమందిరముకైవడి- పద్మములేని కొలనుమాడ్కి- చిన్నవోయియున్నదే.

సీ॥ ఆశ్రమంబున వేడ్క • నలరారఁజేసెడు
వేదఘోషయ దేల • వినఁగరాదు
నన్నుఁజూచినయంత • మునిపత్నులందందు
నేగుచున్నారిందు • కేమికతమొ
అగ్రజా! వచ్చినా • వా! యనిననుజేరి
కౌగలించులవుడు • కానరాడు

నాదు రాకనుగాంచి • మోదమున నెదురు
గావచ్చుమాయమ్మ • కానఁబడదు

తే॥ గీ॥ వటువులెల్లరు నన జూచి • పలుకుమాని
శిరములెత్తకయుండిరి • చింతఁబడుచు
గారణంబేమొయిట్లుండ • గా; మనంబు
నందు, మితిలేనియూరాట • మూనహిల్లె.

తక్కిన విషయము లెట్లుండినను, యాశ్రమ ముందాటఁగాదుకొను చుండు ముద్దుతమ్ముఁడు కనుపించుట లేదు. (ఇటునటుఁజూచి) ఇదిగో! మాతల్లి. (సమీపించి) ఏమిఁదీ! ఈమె మూర్ఛిల్లియున్నది. (తనవస్త్రముతో విసరుచున్నాడు)

సీత—(లేచి) హా! కుమారా!

కుశ—అమ్మా! నీవిట్టి దీనావస్థనుబొందుటకు గారణమేమి!

(అను 25)

ఉ॥ ఎవ్వఁడుభీతిలేకనిను • నీగతినొవ్వఁగఁజేసెనీమనం
బెవ్వనిశిక్షసేయఁగను • నెంచెను! నీసాబగేలదప్పెనీ
కివ్విధినింత చింతయది • యేటికిగల్గెను, సంశయింపకే
యవ్విధమంతయుఁ దెలుపు • మా! జననీయివిగో ప్రణామముల్

మ॥ జననీ! యింతటిచింతయేమిటికి, నే • చండాలుఁడిప్పట్లనె
గ్గును నూహించెను, నట్టుగానియెడ నె • గ్గున్నీవెయెవ్వానికై
నను సేయంగదలంచినావె మదిలో • నగ జెప్పుమీవేగ, నె
వ్వని శిక్షింపుదు, నెవ్వనింగరుణతోఁ • బాలింతునిప్పట్టునన్॥

అకల్మషచిత్తవు - సాధ్వీమణివి - పరదేవతవు - అట్టినీకెగ్గుదలపెట్టినవాడు - చతుర్దశభువనములలో నెంతటివాఁడైనను సరే, నిశిత నారాచంబునఁగుచ్చి యెత్తి నీయెదుటఁబడవైచెదను. అమ్మా! నావిన్న పమాలించి మారుపలుకవేమి! తమ్ముఁడు గానరాఁడేమి! దుర్వార్తయేదైన నీశ్రవణరంధ్రంబులను బ్రవేశించినదా.

చ॥ కనులను నీరువాహినిగ • గట్టగనేడ్చెదవేల తల్లి! నా
యనుజుఁడు గానిపింపడెట • కైననుబోయెనెయాటకై, మనం

బునఁ బరితాపమేల! వగ • పుఁ విడియింక వచింపు మమ్మ, నీ
యనుగు కుమారు డీకుశుని • నంపుము దేనికైన (మొక్కెదర్

సీత—(లేచి) నాయనా! నేను విధికృతమున దిక్కుమాలినదాననై యి
ట్లరణ్యప్రదేశమున నల్లాడుచున్నను మీసోదరద్వయమును జూచు
కొని కాలక్షేపము సేయుచున్నాను. ఎవడో రాజట- మఖాశ్వము
వెంట వచ్చినాడట. ఆయశ్వమును మనలవుడు బంధించినాడట
రాజు లవునిక్రూరాస్త్రింబుల గుచ్చి నేలఁ బడవైచి రథముపైఁ
బెట్టుకొని పోవుచున్నాడని గాలవుడు చెప్పినాడు.

కుశు—ఆదురాత్మా! ఎవ్వడవు రా నీవు కుశుని శౌర్యాటోప విజృంభణం
బును, నస్త్రవిద్యా పాటవంబును బరీక్షింప దలంచితివి కాబోలు
(సీతంజూచి) తల్లీ! నీవువిచారముడిగి ధైర్యచిత్తవై యుండుము -
తమ్ముడు నీయెదుటనున్నవానిగనే భావింపుము వాల్మీకి కృపా
సమాసాది తాస్త్రవిద్యాధురంధరుడగు తమ్ముని కేయపాయము
వాటిల్లియుండదు.

మ॥ వనజాతాప్తుడు గ్రుంగకుండ వినుమా • బల్మాట లేలా, లవుఁ
రణరంగంబున మూర్ఛపుచ్చి చనునా • రాజాధముంగూల్చి, నా
యనుజుఁ దెచ్చి నమస్కరించెద నుసీ • కమ్మా నన్ నమ్ముమీ
వనిగావింపకయుంటి నేని యపుడే • ప్రాణంబులన్ వీడెదన్

అమ్మా! ఇంక నాశీర్వాదింపుము (అను 26)

సీత—నాయనా! సాహసమువలదు. నన్ను మఱింత దుఃఖసాగరములో
ముంచివైతువా! తండ్రీ ఎందుకీ యుద్ధము! నీవైనను నాకన్నుల
యెదుటనుండుము.

కుశు—తల్లీ! నీవునన్నుగూర్చి భయంబును బొందవలదు

ఉ॥ చిచ్చఱకన్నునుం దెరచి • చేతఁద్రిశూలము దాల్చిరుద్రుఁడే
వచ్చిన, భీతిబొందక య • వారితశౌర్యముతన్ విరోధిన
స్వచ్ఛట లాస్త్రసంతతినిఁ • జంపి. తదీయశిరంబు నీకునే
నచ్చునకాయఁజేసెదవి • యచ్చరులచ్చెరువంది మెచ్చగన్

ఆలస్యమునకు నాచిత్తము సైపదు లవునితోఁ బోవుచున్న యాన్ప పాలాధముని గలసికొనవలయును.

సీత—(కుమారా) ఏగివచ్చెదవా (తనలో)

సీ॥ ప్రాణేశుఁడౌ రాము • పాదపద్మంబుల
లవితభక్తిని నెప్పుడు • గొలుతునేని
పతియిచ్చునాజ్ఞయే • రతనాలమూటగా
దలచివర్తించెదు • దాననేని
రాముఁడే దైవంబు • రాముఁడే మోక్షంబు
సర్వంబు రాముగా • జరుపుదేని
లోకైకసాధ్వియీ • లోలాక్షియనునట్టి
యగ్నివాక్యంబు స • త్యమగునేని.

తే॥ గీ॥ రామమూర్తికినామీద • రమ్యకరుణ
సంతతముగల్గునేని, యీ • సమరమందు
కుశునకుజయం బొదవుగాక • కొడుకులవుని
గాంతుగాక నాకన్నుల • కరవుదీర.

కుమారా. సమస్తదేవతలు నిన్ను రక్షింతురుగాక! భగవంతుడగు శ్రీరామచంద్రునియనుగ్రహము నీపైనుండుగాక! శుభమగుగాక! పోయిరమ్ము.

కుశు—(తల్లికినమస్కరించి—నిష్క్రమించును.
అననికపడును.

---

రంగము:—(అరణ్యము:—రథముపై లవుని బెట్టుకొని శత్రుఘ్నుఁడు-పోవుచుండును.)

కుశుఁడు—(ధనుర్ధరుఁడై తొందరగాఁ బ్రవేశించి శత్రుఘ్నునిజూఁచుచు)

చ॥ నిలునిలు మేడకేగెదవు • నీవిపుడోరి నృపాల! యాజిలో
గలితపరాక్రమక్రమము • గల్గెను గాయని కుఱ్ఱవాని, మూ
ర్ఛల నొనరించి తోడ్కొనుచుఁ • జేరుదు వేనగరంబు; సిల్పి నీ
చలము బలంబు జూపుమిక • శౌర్యపరాక్రమ మేర్చివచ్చితిన్

(రథమున కడ్డుగాఁబోయి)

ఓయీ! రాజా! నీపరాక్రమునకు జగంబులు హసించుననియైన దలంపవైతివే. పిచ్చుకపైన బ్రహ్మాస్త్రమన్నట్లు కన్ను తెఱవని పసికూనపై దారుణాస్త్రప్రయోగముజేసి మూర్ఛపుచ్చి రథముపై బెట్టుకొని పోవుచుంటివా! ఆహా! ఎంతపరాక్రమంతుఁడవు! ఎంతటి ధనుర్విద్యాపాటనము గలిగినవాడవు. ఇదిగో! నీపాలిటికి గాలుఁడవైవచ్చిన నన్నుఁజూడుము. నిన్నిక నొకయడుగైన నవతలకు బోనియ్యను.

శత్రు—(తనలో) ఈబాలుఁడెవఁడు. తాపసాశ్రమములయందుండు వీరికిట్టి శౌర్యసాహసంబులెట్లు లవడినవో గదా! ముఖవైఖరిచూడ నీబాలునికి సోదరుఁడగునని తోచుచున్నది. ఏకారణము చేతనో నాకు వీరిఁజూచిన యధికానురాగ ముదయించుచున్నది. ముఖలక్షణములు మాతల్లియగు సీతామహాదేవిని స్ఫురణకు దెచ్చుచున్నవి. రాముని చే లోకనిందాని వారణార్థము కాంతారమధ్యమున విడువఁబడిన సాధ్వీమణియగు సీతామహాదేవి యీపుత్రద్వయంబు గనియుండు నాయను సంశయము నామనంబున వొడముచున్నది. ఇపుడు నేను చేయవలసిన దేమున్నది. ఈవీరబాలుడు రథమునకదలకుండ నిలువరించినాడు. (ప్రకాశముగా) ఓయీ! తాపసబాలకా! నారథము నిలువరించితివేల! నీవు మాబోంట్లతో యుద్ధముసేయఁ దలంచితివా యేమి; అట్టి యుద్దేశమేయున్నచో నీతమ్మునిపాటుఁ జూచుకొనుము

కుశు—ఓయీ! రాజా! ఇట్టిమాటలను గట్టిపెట్టుము. ఈకుశునితో బోరుట సామాన్యమనుకొంటివి కాబోలు! పసికూనను మూర్ఛపుచ్చి రథముపై బెట్టుకొనుటకాదు.

(అను–27)

ఉ॥ బాలుడటంచుఁ జూడకుము • పార్థివ! నేడిటనీదుపాలికిన్
గాలుని లీలవచ్చితిన • గణ్య పరాక్రమ దర్పమేర్చి యా
ఖీల రణావనిన్ నిలువు • మీ! యటుగాక భయంబు గల్గినన్
బాలనజేసెదన్ వినుము • నన్ శరణంబును బొందనెంచుమా.

శత్రు—అవురా! ఎంతసాహసపు వాక్యములు పలుకుచుంటివి. నిన్నునేను శరణంబు వేడవలయునుగా! ఇక నీవాక్పేటికకు బీగమువైచి నా మాటలువినుము- మనసిజునినించు చారుసుకుమార మూర్తివగు నిన్నుఁజూచినఁ గరుణ జనించుచున్నది. అట్టిచో నిన్ను దారుణాస్త్రములచే నెట్లొంతును! మునిబాలుండవగు నీకీరణ ప్రచారమేల!

ఉ॥ తమ్మునిపాటుజూచి కను • దమ్ముల నీరునుగార్పనేల! నా
యమ్ముల జూడనేల! • భయమందవిదేల యొకిం తన్మైన; ద
ర్పమ్ములు బల్కనేల! ఘన • ఖండన భూమికిఁగ్గదేల! మీ
యమ్మ విచారమందుఁ జను • మా! యొకఁడీల్గిన మాటనెంచుచున్

కుశు—రాజా! వట్టిగొడ్డుప ఆలపులెక్కువ ఏల యీ కంఠశోష.

లవు—(మూర్ఛనుండి లేచి- రథముపైనుండి లంఘించి)

మ॥ రణరంగంబున నట్లుమూర్ఛఁగనుమా • (త్రాసన్ భళావీడు చ
చ్చెనటంచున్ ముదమందినావే! యిది నీ • జీవంబులన్ బాపలే
చెను నీతాపస బాలకుండు, భయమున్ • జిత్తంబునన్ వీడి యీ
రణరంగంబున నిల్వుమా నృపతి! ద • ర్పంబెల్ల దూలించెదన్.

మఖాశ్వమేది. ఏదీ! (ఎదుటనున్న కుశునిఁజూచి) అన్నయ్యా నీవెప్పుడువచ్చితివి?

కుశ—తమ్ముఁడా! మూర్ఛనుండి లేచి నాకునయనపర్వమొనర్చితివా?

లవు—అన్నయ్యా! మన మీ నృపాలుని గర్వమడఁచి సవనహయమును మరల బంధింపవలయును. (శత్రుఘ్నునిఁజూచి) రా! రాజా నీపాలిటికి మృత్యుస్వరూపులము నిలచినాము. ఇకనెందు బోగలవు (శరములు సవరించుకొనుచున్నాడు)

శత్రు—(తనలో) అశ్వినీ కుమారుల చందమునఁ గన్పట్టుచుఁబరాక్రమమున విజృంభించుచున్నారు. నేనింకఁ గరుణ సహింపరాదు. (ప్రకాశముగా)

తే॥ గీ॥ మునికుమారుల నేరీతి • భూరి రణము
నందుదాకుదునాయని సంశ • యంబుచేత

నింతవఱకు సైచితిగాని • యెంతవారు
బవరమునవిల్వ మీరలు • వటువులార

రండు—

కుశ—ఇదిగో! సంసిద్ధులమై యుంటిమి.

లవు—(అస్త్రము సంధించి) దీనింగాచుకొనుము. (శరప్రయోగము సేయును.

శత్రు—ఇదిగో! శరము ఖండింపఁబడినది. (తనలో) లవణునితోఁ బోరు నప్పుడైన భయమునందని చిత్తము నేఁ డేలనో వెనుదీయుచున్నది (ప్రకాశముగా) మునికుమారులారా! ఇంకమీరు భ్రమపడి లేని వారలే, (శరప్రయోగము సేయును.)

కుశ—(శత్రుఘ్నుని శరమును ఖండించి)

ఉ॥ నచ్చని మాటఁబల్కెదగు • నాయిటు భూపతి; యింకఁ జూడుమీ
వెచ్చటి కేగినన్ విడక • నీవెనువెంటనె యేగుదెంచి య
స్మచ్చటు లాస్త్రమిద్దినినుఁ • జంపియెతీరును మాదుతల్లియున్
ముచ్చటబొంది పుత్రకుని • భూరిపరాక్రమ భంగినెన్నఁగన్

(శరప్రయోగము సేయును)

(శత్రు నేలగూలును)

కుశ—తమ్ముఁడా! అశ్వమును బంధించుకొని పోవుదముర మ్ము.

(నిష్క్రమింతురు)

(అవనిక జారును)

రంగము:—[వాల్మీకాశ్రమమున:—సీతయు జనకుండును ప్రవేశించుచున్నారు]

జన—అమ్మాయీ! నీవు వాల్మీకాశ్రమమున సుఖప్రసూతవై యిరువుర కుమారులంగాంచితివని కర్ణాకర్ణికగావిని వచ్చినందులకు నిన్నుఁగంటిని. నాసంతోషమునకు మేరలేక యున్నది. పుట్టుక చేతనే పరమపావనివైన నీకీనిందవచ్చుటయు భగవంతుఁడగు శ్రీరాముఁడు నిన్ను నరణ్యములకంపుటయు- బురాకృతకర్మమని

తలంపవలయునుగాని మఱియొండుకాదు- మనుమలను గూడ జూచుటకు నాచిత్తము దత్తరమందుచున్నది.

సీత—తండ్రీ! ఎవరో రాజేంద్రుని యజ్ఞహయమును చిన్నకొడుకు బంధించుటచే యుద్ధమొరవినది, మనుమలే జయము వహించిరట ఇంతలోనె వారిటకరుదెంతురు.

(లవకుశవులు—ప్రవేశింతురు)

లవ కుశ — (సీతంగాంచి) రణమున విజయలక్ష్మి లాలితులైవచ్చిన కుమారుల వందనము లందుకొనుము, (నమస్కరించుచున్నారు)

సీత—నాయనలారా! ఈయన మీమాతామహులు. నమస్కరింపుడు

కుశ—ఆహా! ఏమి! మాభాగ్యము! రణమున విజయలక్ష్మిగాంచినసంతోషము ద్విగుణీకృతము సేయుట కీమహామహుని సందర్శనభాగ్యము మాకు లభించినది. జనకునికి (నమస్కరించును)

లవు—(జనకునకు నమస్కరించును) తాతా! ఇంతకుము న్నరణ్యమున శార్దూల సంబంధములో మీదర్శనము జేసితిమి. కాని మన్నింపుడు తెలియక యపరాధము గావించితిమి,

కుశ—తాతా! మాకు మాతామహులున్నారని మాయమ్మ యప్పుడప్పుడు చెప్పుచుండుటయేగాని, కన్నులార వీక్షించుభాగ్యము మేము నోచుకొనలేదు అయ్యది మాపూర్వపుణ్య వశమున నేటికి లభించినది.

జన—వత్సలారా! మిమ్ముల జూచినప్పుడు నాకును ననుమానమే కలిగినది.నాయనంతరము నిమివంశ రాజ్యసింహ పీఠనారోహించు మిమ్ముఁజూచుటకే నేత్రములు రెండును చాలకయున్నవి.

లవు—తాతగారికి మాయందుండు ప్రేమాతిశయమునన ట్లు బలుకుదురు.

కుశు—అమ్మా! మేమిక్కడఁ దశవుసేయరాదు. యజ్ఞహయము నొకవృక్షమునకుఁ గట్టివచ్చితిమి శత్రువు లెవ్వరైన వత్తురేమో' మేము దాని రక్షణోద్యోగమున వర్తింపవలయును.

జన—(తనలో) అయ్యది శ్రీరామచంద్రుని యాగహయంబు- కుమారులకు వారితోఁ గలహము ఘటిల్లినది. మేలు. మేలు.

దీనివలన సీతకు శుభంబౌదవును. నేనిప్పుడీ సంగతిఁ బ్రకటింప గూడదు. (ప్రకాశముగా) కుమారులారా! మిమ్ముల దాకువారు సుక్షత్రియవీరులై యుందురు. అయినను వాల్మీకులవారి యనుగ్రహమున సకలాస్త్రవిద్యల నభ్యసించిన మీకెదురు లేదు. కాని, జాగరూకత గలిగి వర్తించుట శ్రేయమని హెచ్చరించుచున్నాను. యజ్ఞకర్తయగు భూపాలుఁడొక వేళవచ్చిన వచ్చుఁగాక! "నావిష్ణుపృథివీపతిః" యను వాక్యము దలంపుఁడు. రాజునెడలఁ జూపవలసిన భక్తి మఱువవలదు.

లవు—చిత్తము. ఇక మేము సెలవు దీసికొని పోయివచ్చెదము.

జన—మంచిది. మీకు శుభమగుగాక,

(ఇరువురును - సీతకును - జనకునకును నమస్కరించి నిష్క్రమింతురు.)

సీత—తండ్రీ! స్నానము జేయుదువుగాక! రమ్ము.

(నిష్క్రమింతురు.)

రంగము:-[అరణ్యము:-లక్ష్మణుఁడు - సైనికునితో ప్రవేశించును.

లక్ష్మ—(తనలో) ఔరా! ఇట్టి వింత మున్నెన్నడైనఁ గని విని యుంటినా! మునిబాలకులేమి! భరతశత్రుఘ్నులను మూర్ఛపుచ్చి యజ్ఞాశ్వమును బంధించుటేమి! రఘుకుల శౌర్యంబునకుఁ గళంకము వచ్చినదే. రవికుల వీరశౌర్య మహానలంబును జల్లార్చుట కీతాపసకుమారులెక్కడ దాపరించిరి. (ఇంచుక యూరకుండి) అక్కటా! సీతామహ దేవి నరణ్యమున విడిచినది మొదలు మాకన్నియు ననర్థములే ప్రాప్తించుచున్నవి. కాకున్నచో రణమున మేమెప్పుడయిన నపజయమునుమాట నెఱుంగుదుమా!

సీ॥ లోకపావనియైన ♦ లోలాక్షి నావిధిఁ
గానకంపు ఫలంబు ♦ గాసినిడదె
వనజాక్షి కారీతి ♦ ఘననింద వేయఁగ
నెల్లరాష్ట్రము దహి ♦ యింపఁబడదె

నింద్యాచారాలాలి, కు • ద్దండశోకము జేర్చు
పాపంబు పాకట్లు • బాధలిడదె
నంశపావనికట్లు • వంతలంగూర్చిన
య్యాది ధూమకేతువై • యడచకున్నె

తే॥ గీ॥ యత్తలకు మఱందులకును • నఖిలబంధు
జనములకు, ప్రాణవిభునకు • సంతతంబు
సంతసంబును గూర్చెడు • చాననట్లు
జేసినందుకుఁ గష్టముల్ • చేరుగాదె.

(సైనికునిఁజూచి, ఓయీ ! మన యజ్ఞాశ్వ మెచ్చటనున్నది. దానిం బంధించిన తాపసులెచ్చట ! ఆయుదంత మారసిరమ్ము.

సైని—చిత్తము—(నిష్క్రమించును.)

లక్ష్మ—(తనలో) అక్కటా! ఏమికారణమోగాని, లోకైకసాధ్వియు, రామమయజీవితయునగుసీతామహాదేవిసాకేతనగరంబుబాసినది మొదలు మాకుఁ గష్టములమీద కష్టములే. కారణమేమున్నది ఆయాదిలక్ష్మి మమ్ము బాసిపోవుటయే ఆ సాధ్వీశిరోమణి యిప్పు డెచ్చటనున్నదో ఎచ్చట సుఖప్రసూతయైనదో, ఏతాపసోత్తమున కామహాదేవి నాదరించు భాగ్యము లభించినదో! నేనీజన్మమున నాభువనమాతను సేవించు పుణ్యము గాంచుదునా?

(ప్రవేశము—సైనికుఁడు)

సైని—దేవా? యశ్వమొక వృక్షమునకు, గట్టఁబడియున్నది. తాపసబాలకులు మాత్ర మచ్చట గనిపించుటలేదు.

లక్ష్మ—మంచిదే. ముందు హయమును మన సైన్యమున్న ప్రదేశమునకుఁ జేర్చుదము, రమ్ము- (ఇంచుక నడవగా తెర లేచును. గుఱ్ఱము చెట్టునకుఁ గట్టబడియుండును. చాటుగా లవకుశు లుందురు.)

లక్ష్మ—(గుఱ్ఱమును సమీపించి కట్టువిప్పఁబోవును)

లవు } కుశ } ఆ! ఆగుము. ఆగుము-

లవు—(శరప్రయోగముజేసి సైన్యమును ధ్వంసముసేయును)

కుశు—(లక్ష్మణునిఁజూచి) ఎవరయ్యా! నీవు. ఇంతకుముఁదు మాచే నిర్జింపఁబడిన భరతశత్రుఘ్నులకంటె గొప్పవీరునివలె నున్నావు.

లవు—అందుకనే మనము కన్నుచాటుగ నుంటిమేమో హయమును దీసికొనిపోవుటకు దొంగవలె వచ్చినాడు- (లక్ష్మణునిఁజూచి) అంతేనా!

కుశ— తే॥ గీ॥ శౌర్యమున కాలవాలమౌ • క్షత్రియాన్వ
యంబునందు జన్మమునంది • యకటయిట్లు
పౌరుషంబువిడచి దొంగ • వలెను హయముఁ
బట్టనెంతువే నవ్వరే • ప్రజలువిన్న

లక్ష్మ—(తనలో)వీరిమాటలు నాకొకదెసనుండి- నవ్వును- ఒకదెసనుండి కోపమునుగూడఁ గలిగించుచున్నవి, ఈరెండును నట్లుండ కరుణా రసముఁ- అనురాగముఁ- నాయందు మూర్తీభవించుచున్నవి- ఏమిసేయుటకును మార్గము తోచదయ్యెను. (ప్రకాశముగా) బాలకులారా! మీ చిన్నతనపు మాటలనిడిచి యిట్లు వినుఁడు. మీరు మునికుమారులు- మేము రాజులము-

లవు—దాని కెవ్వరేమి సేయుదురు, బ్రహ్మ మమ్మిట్లును- మిమ్మిట్లును బుట్టించినాడు

లక్ష్మ—మీరు మాకనవసరముగ నాగ్రహముఁ గలిగించు దుష్కార్య మొనర్చినారు.

లవు—మే మొనర్చిన దుష్కార్య మేమియునులేదు- అట్టిది సేయ వలదని మాకు గురువులవారు విద్యాభ్యాసమునకు ముఁదుగనే చెప్పియున్నారు.

లక్ష్మ—గుఱ్ఱమును బట్టుట దుష్కార్యము కాదా!

కుశ— అది దుష్కార్యమెట్లగును. శూరులైనవారు పట్టుడని దానికి బిరుదపట్టము గట్టఁబడియే యున్నదికదా!

లక్ష్మ— బ్రాహ్మణవటువులగు మీకిట్టియనవసర కృత్యము లేల?

లవు—భుజభలపరాక్రమ శౌర్యనంతులకవసరమగు పనియే మేముచేసి తిమి. అయ్యా! నీవెవ్వరు?

లక్ష్మ—లక్ష్మణుఁడందురు.

లవు—సరిసరి ఇప్పుడు తెలిసినది. ఇంతకుమున్ను మాచేత గూలినవారు నీసహోదరులేకదా ఇక యుద్ధమెందుకు ఇంటికిఁ బోవఁబట్టుము

లక్ష్మ—బాలకులని సైచినకొలఁదిని మీవాక్ప్రవాహమునీతిమీఱిపాఱుచున్నది.

ఉ॥ బాలకులార యేటికిటు • బల్లిదముల్ వచియింప, నింకనీ
యాలపుబుద్ధివీడుడు • దశాననసంహారుఁడైన రామభూ
పాలుని యశ్వరాజమిది • పట్టఁదిసేతునికైనశక్యమే
చాలునుఁజలుపా • హసము • సత్వరగాననివీడియేగుఁడీ.

లవు—నీరసవాక్యములు పలుకుచుంటివేమి! ఇవి క్షత్రియోచితములు గావు,

చ॥ ధనువుధరించి మేమిచట • దర్పముచేఁ భయంకరాజిలో
నినువెసదాకి గెల్చుఁగొన • నిల్చితిమింతియె; భీతియేల? నీ
ఘనశరపాండితీపటిమ • క్రన్ననజూపుము లేకయున్న యీ
రణముతొలంగిపోయి రఘురాముని దోడ్కొనిరమ్ము లక్ష్మణా.

కుశు—

ఉ॥ ఆహవనామకాధ్వరము • నందుమదీయభుజోజ్జ్వలత్సదా
నాహతచాపముక్స్రుక్కనిశ • తాస్త్రమహాగ్నికినిన్ను నిప్పుడా
జ్యాహుతిగానొనర్చుసుయ • శంబునుగాంచెదలోకమందుమ
త్సాహసవిక్రమక్రమము • శౌర్యముధైర్యముజూడులక్ష్మణా.

లక్ష్మ—(కోపముతో) ఇంకను మీప్రగల్భంబులఁజాలింపరా!

చ॥ అనిమొనననన్నుదాకివిజ • యంబువహించగలేడురుద్రుఁడున్
వనములమానులై తిరుగు • బాహ్మణనందనులైనమీరలా
ననుగెలువంగశక్తులవి • నంగడువింతజనించె నేటికీ
ఘనశ్రమమీకు మానుతుర • గంబునువీడుఁడునిమ్మగాచెదన్.

లవు—నీపరాక్రమప్రకటన మిరజాలును మాకిదివఱకే తెలియును. ఇం ద్రజిత్తునుజంపుటకు నీవుపడుకష్టమరుఁగుదుము. అతడు నిన్నేడా టలాడించలేదా తుదకు" మాయగ్రజుఁడగు రాముఁడు సత్యధర్మ సంధుఁడగునేని యీశరమునిన్నుఁగూల్చు"గాక యని ప్రయోగిం చినావు. ఇందు నీప్రయోజకత్వమేమియులేదు. ఈగౌరవము రామునకే

లక్ష్మ—ఓహో! మీపయిశరంబులువేయుటకు నాకుఁజేతులాడక యిం తవఱకుఁజెప్పితిని నాపలుకులాలింపక యేవేవోపలుకు చున్నారు లక్ష్మణకోపానలము ప్రజ్వలితపూర్వమే మీరుహయంబును వి డిచియావలకుఁబొండు.

(అను. 28)

లవు—అబ్బో! నిన్నుఁజూచిననాకు మిగులభయంబగుచున్నది.

కుశు—తమ్ముడా! ఈతఁడు మాటలలోమిగులపోటరి.

లవు—అయినను జూతము (శరప్రయోగమును జేసిలక్ష్మణుని చేతిలో నుండుధనుస్సు విఱుగగొట్టును.)

లక్ష్మ—(తెల్లబోయిచూచును)

లవు—ఏమయ్యా! ఇదియేనాశౌర్యము. గ్రుడ్లప్పగించి నిలఁబడితివి.

లక్ష్మ—బాలకులారా, సౌందర్యమునందు మీరు కంతుజయంతులం దగడుచున్నారు. శౌర్యమునందా నిశ్చయముగా హరునిపుత్రుం డగు గుమారునకు దుల్యులు. మిమ్ముమెచ్చవచ్చును. మీతో రణమొనర్చి వ్రమందించుటకుఁ జేతులురావు. మీరుమానగరంబు నకురండు మీకునచ్చిన భూషణములుగాని హయములుగాని, వేయేల! మీరుకోరిన దేదైనను నొసంగుదుము.

లవు—మేము కోరినది యిచ్చెదవా!

లక్ష్మ—ఇచ్చెదను-మీకేమికావలయును?

లవు—భిక్ష!

లక్ష్మ—ఏమిభిక్ష?

కుశు—రణభిక్ష

లక్ష్మ—మీరామాటను విడువకున్నారే

లవు—నీవు విడుచువరకు మేము విడువము

లక్ష్మ—విడువరుగా! ఇంకమీయెదల గౌరవత్వము వహించుచున్నాను. పిదపలాభము లేదు.

లవు—ఇట్టిప్రగల్భములతో బెదిరింపకుము చేతనైన శరంబు ధరించి నిలువుము.

లక్ష్మ—ఇదిగో! (శరప్రయోగము సేయును)

కుశు—మాతల్లిలోకైక సాధ్వియగు నేని యీయస్త్రమునిన్ను నేల గూల్చును. (శరప్రయోగమును సేయగా లక్ష్మణుడు పడును.)

అవనిక జారును

ఇది పంచమాంకము.





# లవ-కుశ.

## షష్ఠాంకము.

---

(రంగము:—)[అరణ్యమున-అంజనేయుడు -ప్రవేశించును.

అను 29

అంజ—భగవంతుని చర్యలనంతములు ఏఘడియకేది సంభవించునో ఎవ్వరును చెప్పజాలరు. నిరుపమాన సాధ్వీశిరోరత్నమని యనలుచేత మెప్పొందిన జగన్మాతను మాసీతామాతను రామచంద్రుండు ఖలజనుల నిందావాక్యములపై నిందుచులాలనియైన దలంపక యరణ్యములకుఁ బంపినాడట. సద్గుణగరిష్ఠుడురఘుకుల వర్ధిష్ణుడు-సాక్షాద్విష్ణుడు ఆశ్రీరామమూర్తియే జనాపవాదను విశ్వసించి మాతల్లియెడలనంతకఠినత్వము వహించెనా! కాదు. కాదు. అమ్మహానీయుడు సకలము దెలిసిన వాడయ్యును నయ్యపవాదకు భయమంది సీతామహాదేవి సత్కీర్తిలతలు జగంబున ద్విగుణీకృతముగఁ బాకించుటకు నిట్లొనర్చియుండును ఏమైనను మాతల్లివనంబులందెట్టి కష్టములు నందుచుండునోకదా సుఖప్రసూతయై యిరువుర కుమారులంగని వాల్మీకాశ్రమమున నందున్నదని మాత్రము నాయాశ్రమ సమీపమున నుండు తాపసులచే వింటిని. ఆహా!నాకు జిన్నతండ్రులుపుట్టిరి. చిన్న దేవులు పుట్టిరి. ఎప్పుడుమాసీతమ్మతల్లిని పుత్రసహితంబుగ జూతునోఎప్పుడామె చరణకమలములకు నమస్కరింతునో వాల్మీకాశ్రమమీ ప్రాంతమునందే కాబోలునున్నది ముందుగనక్కడికి బోవుదునా? కాదు కాదు- సాకేతపురంబున మాయావేషముల జేరి యపనింద బుట్టించి సీతకును రామునకు నెడబాపినది శూర్పణఖా

కరాళులని వినియుంటివికదా! వారిబాడ నరసి నా వాలంబునకు జుట్టుగొని పోయెదగాక! ఇంచుక కాలమీ వృక్షమునీడన విశ్రమించెదగాక!

(అని చెట్టునీడ గూరుచుండును)

(చెట్లమఱుగునుండి శూర్పణఖకరాళులు ప్రవేశింతురు)

కరా—శూర్పణఖా! ఆలోచనలో నీయంతవారు లేరు. మనమాయా వాగురలో సీతారాములు చక్కగఁ జిక్కినారు.

శూర్ప—వారిని మనము సాధించుట యిట్టిమాయల చేతనేగాని మఱియొకటి కాదు. సీత కరణ్యావాసము గల్పించితిమిగదా! రామునకుఁగూడ నెట్లో మరణముఁగూడఁ గలిగించితిమా! ఇక మనము జయించినట్లే.

కరా—దానికిగూడ నీవేత్రోవఁ జూపవలయును. కాని మనచాకలివేషము నెవ్వరుగుర్తింప లేదుసుమా.

శూర్ప—దైత్యులమాయ లెవ్వరు కనుగొందురు.

కరా—ఇంతత్వరలోనే మనము సాకేతనగరము విడుచునట్లు జేసితివేమి!

శూర్ప—ఇంక బెక్కుదినములుండరాదు. ఒకవేళలంకకుఁ జిచ్చుబెట్టిన కోతిగాడు. ఆంజనేయుడిక్కడకు వచ్చెనా యొకవేళ మనగుట్టు బయలువడును.

ఆంజ—(లేచి) ఇదుగో! ఆంజనేయుఁడు మీకొఱకే చూచుచున్నాడు.

(శూర్పణఖాకరాళులు ఇటునటు పరుగెత్త బోగా నిరువురను బట్టుకొని చెఱి యొకచంకను బెట్టుకొనినిష్క్రమించును)

రంగము:—(అరణ్యముయుద్ధభూమి:—(శ్రీరాముఁడు-ప్రవేశము)

శ్రీరా—ఆహా! ఫుండుపైఁ బుల్లయన్నట్లు నాకుమరలనీ సంకటమేమి! ఒకప్రక్క జానకీ వియోగమునకు దుఃఖించుచు, వసిష్ఠముని ప్రబోధితుఁడనై యశ్వమేధయాగదీక్షా బద్ధుఁడనైతిని అయ్యో ఈయాగము నేనేల తలపెట్టితిని. దీనిమూలమున నాతమ్ములను కూడఁ గోలుపోయితినే. పరమసాధ్వీమణిని- అమూల్యసద్గుణ

రత్నఖనిని-మదీయచరణపంకేరుహసేవతప్ప నితఃపరమెఱుంగని సాధుశీలను- జానకిని- సంపూర్ణ గర్భవతిని నరణ్యములకు దోలిన పాపమునన్ను బాధింపక విడుచునా! ఆసుచారిత్ర కంటినుండి వెలువడిన యొక్కొక్క భాష్పబిందువురా కొక్కొక్క కష్టమును గూర్పక యుండునా? అవతల భార్యావియోగమునకుఁ జింతింతునా? ఇవతల తమ్ములు రణంబున గూలినందుకు విచారింతునా! రాముని జీవితము వ్యర్థమైపోయినది. కళంకమైనది. హా! తమ్ములారా! భరత శత్రుఘ్నులారా? నామూలముననగదా మీకిట్టి పాటుసంభవించినది లక్ష్మణా! భాతృవత్సలా! నీవంటి మహాశౌర్యశాలినిగూడ మునికుమారుల పాట్టుకుఁబెట్టితినిగదా! అతికాయుని వధించిన మహాశౌర్యమే పంచనుజేరనది? కుంభ నికుంభాది ఘోరాసురుల ద్రుంచిన విక్రమాటోప మేనీటగలిసినది? ధూమ్రాక్షుం జంపిన శక్తి యెందడంగినది. రావణాత్మజుండగు మేఘనాధుని దుర్వారగర్వంబడంచి కాలుని వీటికంపిన యస్త్రవిద్యా ధురంధరత్వ మేనీటడాగినది? ఇట్టి మహాశక్తిగల నీవేతాపసకుమారుల బాణముల కెరయైతివికదా? హా! సౌమిత్రీ! నేను నిన్నెట్లు మఱవఁగలను. నన్నుబాయజాలక యరణ్యంబులకు నావెంటవచ్చినావు. నిద్రాహారములుమాని పదునాల్గు వత్సరములు నాకు సేవలఁజేసినావు. నాకష్టసుఖములే నీకష్టసుఖములుగ భావించినావు. నిరంతరము నాయాజ్ఞశిరంబున ధరించి మెలంగినావు. హా! తమ్ములారా! మీరందఱును సజీవులగుట నేను కన్నులారఁ జూడగందునా? (ఇంచుకయూరకుండి) ఓహో! నేనిట్లు దుస్తరశోక జలధింగూలి కార్యము మఱచియుంటిని. యజ్ఞాశ్వమును బంధించిన యాబాలకులను గూర్చి విచారింప వలయునుగదా! యజ్ఞదీక్షాబద్ధుఁడనైన నేను యుద్ధమెట్లు సేయుదును. (ఇంచుక నడచును.)

(లవకుశులు ధనుర్ధరులై ప్రవేశింతురు.)

లవ—అన్నయ్యా! అటుఁజూడుము.

మ॥ కమలానాయకుఁడో ప్రభాకరుఁడో! యా • కామారియో! భారతీ
రమణీనాథుఁడో పంకజాహితుఁడో, తా • రాభర్తయో! వీనితే
జమునిండెన్ దిశలెల్ల, నెవ్వడితఁడీ • చందంబునన్ మేటియై
క్రమముల్ దాల్చి చరించు నేమిటికి, నీ • స్వాంతంబునం జూడుమా

శతకోటి మార్తాండ సమశరీరమును, పద్మపత్రసన్నిభనయనంబులును, వజ్రకవాట నిభవక్షస్థలమును- మందార కుసుమదామంబును మహానీయ మాణిక్యమయకిరీటంబును, నీలమేఘశ్యామల వర్ణంబును- గలిగి విరాజిల్లు నీమహానీయుఁడు మనకు నయానపర్వ మొనర్చుచున్నాడు.

కుశు—తమ్ముఁడా! ఈమహానీయుఁడెవ్వ తెలియదు గాని యీతనిం జూచుటచేత నేమి కారణమోగాని నాచిత్తమున నదియొక విధమయిన. భక్తి- ప్రేమ- యుదయించుచున్నది.

లవు—అవును. నాకున్న ట్లీయున్నది.

శ్రీరా—(బాలకులను సమీపించి) బాలకులారా! మీరీయరణ్య ప్రాంతమునందే చరించువారా!

లవు—అయ్యా! తమ కేమి కావలయును.

శ్రీరా—కొంచెము పనియుండియే యడిగితిమి.

కుశు—అవును! మీరుతలఁచినట్లీ యరణ్యమంతయు మాసంచారభూమియే.

శ్రీరా—ఇక్కడ నెవ్వరో యిరువురు మునికుమారులు మాయజ్ఞాశ్వము బంధించినారఁట. వారలను మీరెఱుంగుదురా!

లవు—వారితో తమ కేమి పనియున్నది.

శ్రీరా—యజ్ఞాశ్వమును దీసికొని పోవుటయే.

లవు—వారు విడిచినఁకదా!

శ్రీరా—బాలకులగుటచే నెమ్మదిగా వారిని సంతసింపఁజేసి తీసికొని పోవుదును.

కుశు—ఈయుకున్న

శ్రీరా—క్షత్రియోచిత కార్యమున కుపక్రమించెదను.

లవు—మంచిమాటఁ జెప్పితివి. వీరుఁడవనఁగా నీవే వీరుఁడవు నీముఖ లక్షణములనుబట్టి నీవొకరాజేంద్రుఁడవని తోఁచుచున్నది. అభిదాన మెఱుంగవచ్చునా?

శ్రీరా—నన్ను శ్రీరాముఁడందురు.

కుశు—ఆహా! నిన్నుఁ జూచుటంజేసి మేము ధన్యులము. మహారాజా! యజ్ఞాశ్వమును బంధించి మీయాత్మ్ములను ప్రమందించిన మునికుమారులు వీరెయని భావింపుము.

శ్రీరా—మీరేనా- (పరికించి తనలో) సుందరరూపులగునీకుమారద్వయము నుజూడ నాచిత్తమున నదియొక విధమగు భ్రాంతికలుగుచున్నది. ముఖలక్షణంబు లన్నియు సీతం బోలియున్నవి. ఈ నడక ఈఠీవి- ఈమృదుమధుర వాక్చమత్కారము- జా రా- తాపస పుత్రులకుండునా! పరమ కిరాతుఁడనైన నాచేత నరణ్య భూములకుఁ బంపఁబడిన సీత వీరింగాంచియుండునని యాశ కలుగుచున్నది. ఈనీర్భాగ్యునకట్టి భాగ్యముగూడనా.

చ॥ మనసిజరూపచారు సుకు • మారకుమారుల వీరిఁజూడగా
మనమున గల్గుచుండెన స • మానకృపారస మెద్ధిహేతువో
యని మొనవీరిఁదాకిని శి • తాస్త్రము వేయగఁ జేయవచ్చునే
మనుకుల రామభూదవుని • మానసమంతటి క్రౌర్యమూనునే.

సీ॥ ముద్దువచ్చెను వీరి • మోమువీక్షింపంగ
బాణాసనంబెట్లు • బట్టగలను
కరుణగల్గెనువీరి • కమనీయదేహకాం
తులుజూడ రణమెట్లు • సలుపగలను
ఆనందముదయించె • నతిమృదువాక్కులఁజూడ
ధీరవాక్యములెట్లు • దెలుపగలను
ఋనురాగమొదవె బా • ల్యపు సాహసముజూడ
గార్యమేరీతిఁ • గాంచగలను

తే॥ గీ॥ ఇట్టిసుకుమారమూర్తుల • నిట్టిమహిత
శూరవర్యుల మునులందు • జూచినానె

కారు మునికుమారులువీరు • కాననిట్లు
దిరుగు నశ్వినీసుతులుగా • దెలియువాడ

(ప్రకాశముగా) కుమారులారా! మీ సాహసచర్యలు అత్యద్భుతమునే గొలుపుచున్నవి. మీరు తాపసపుత్రులు, వనంబుల దపోవృత్తినుండువారు, మాతో మీకు విరోధమేల? బ్రాహ్మణులకు యుద్ధముతో నేమి పనియున్నది! అట్టిది క్షత్రియులకే విధింపఁబడియున్నది.

మ॥ మగరాలా! మగరాలహారతతియా • మాణిక్యసౌధంబులా
జగమెల్లన్ భ్రమజెందగాదగు మహా • స్వర్ణంపుచేలంబులా
సొగసుంగుల్కు హయంబులా! కరుల! • యస్తోకంపుభాగ్యంబులా
తగవాంఛింపుడు మీ కొసంగెదసుఁడీ • తథ్యంబుగా బాలకుల్.

ఇదియు తయునేల - మఖవాజితప్ప నేదికోరినను నొసంగెదను. సాకేతనగర సామ్రాజ్యమునకు నర్ధభాగమునకు మిమ్మధిపతులుగా జేసెదను. హయంబును విడువుడు.

లవు — మహారాజ! నీవు చక్రవర్తివి, నిరంకుశశాసనుండవు, నీయాజ్ఞ కాదనువారెవ్వరును లేరు - నీవిచ్చుదానమున కడ్డుగల్పించువారెవ్వరును లేరు. రాజ్యమందర్ధభాగమంటివి, అట్టి యపేక్ష మాకిప్పుడు లేదు - ముందుసంగతి యెట్లుండునో,

కుశు —

సీ॥ మాణిక్యమయమైన • మంచి హారము లేల
పరమిచ్చు రుద్రాక్ష • సరులుగల్గ
బంగారుజల్తారు • పట్టుబట్టల వేల
లలితవల్కల చే • లములు లేవె
వైభవంబుననుండ • వరసౌధతతియేల
సంప్రీతినిడు పర్ణ • శాల లేదె
భూరిరసభరిత • భోజనంబదియేల
బహువిధవనఫల • వసతి లేదె
తే॥ గీ॥ బహుళరథగజవనాశ్వ • బలమ దేల
బహుభయంకర వనమృగ • బలము లేదె

క్షాత్త్రములఁ బెల్ల నేలునా • సక్తియేల
సతత పరమేశ చింతనా • సక్తి లేద

లవు—మహారాజా! యిదియంతయునట్లుండ కరంబుల ఖడ్గంబుల ధరించిపరాక్రమశౌర్యములే ధనముగాభావించు మాకు వీనితో నేమిపనియున్నది. మావంటివారు చేత ఖడ్గము ధరించుట యెందుకు అలంకారార్థమా? కాదు యుద్ధభూమియే శూరులకు క్రీడాప్రదేశము సంగరమే యిహపరలోకముల యందు వీరునకుగీర్తి దెచ్చునది. అదియే సకల సౌభాగ్య ప్రదము అదియే ధర్మసంరక్షణార్థమై వీరులు రక్తమును స్రవింప జేయుస్థలము.

శ్రీరా—(తనలో) వీరరసముద్భవింపజేయు వీని పలుకులునాకు మిగుల వింతగొలుపుచున్నవి. (ప్రకాశముగా) అట్లయిన మీరు క్షత్త్రియకుమారులేనా.

లవు—నీవుగ్రహింపలేదా!

శ్రీరా—(తనలో) ఏమిది! నాయాశయము నిశ్చయమగునా (ప్రకాశముగా) అయిననేమి! మీరుబాలకులు మేము రణంబున నారితేరినవారము అదియుంగాక నేను భూపాలుడను నామాటవిని యశ్వమును విడువుడు.

మ॥ తగనీయాజ్ఞను దీర్చుకన్నను బ్రశ • స్తంబైన సత్కృత్యమీ
జగతిన్ లేదనుఁటేనిజ ; బయినస • త్శౌర్యంబునన్ గీర్తిఁగాం
చఁగమేమిచ్చోట బట్టినట్టిహయమే • చందంబునన్ వీడగా
నగు; సందేహమ దేలపొందెదవు ఘో • రాజిన్ మమ్మున్ దాకుమా.

లవు—(భక్తిసూచించుచు) దేవా! రామచంద్రా! అర్కకులవారాసిచంద్రా భవదీయ దివ్యమంగళ విగ్రహసందర్శనమున మేము ధన్యులమైతిమి. సముద్రబంధన సమయమున నిన్ను సేవించుచు వెంటనరుదెంచిన కపులకన్న నెక్కుడుప్రేమతో నుడుతనులాలించినావు. పరమనిష్ఠాగరిష్ఠులై తపంబొనర్చిన మునీంద్రులతో దుల్యుడగునట్లు జేసి యక్షీణకరుణాకటాక్షంబున బక్షినాధునకు మోక్షమిచ్చినావు. రావణవధానంతరంబున నయోధ్యకుమగలి

వచ్చుచు భరతుని న్నను ముందుగా గిరాతనాయకుండ గుగుహు
ని సేమమరయ హనుమంతుని బంపినావు. భరద్వాజమునీంద్రుని
సత్కారంబున శబరియిచ్చినపండ్లను నొక్కరీతిగ భావించినావు.
నీవు సాక్షాద్రమానాయకుడవు గాని సామాన్యమానవుడవుగావు
ధరాభారము బాపుటకిక్ష్వాకువంశంబున నిట్లవతరించితివి.

శ్రీరా—(తనలో) పరాక్రమము - ధైర్యము - సాహసము - వీనితో
బాటు నద్వితీయమైనభక్తి! వర్ణనాతీతము అమృతములొలుకు
వీరి పలుకులు నన్ను సంగర పరాఙ్ముఖునిగ చేయుచున్నవి.
(ప్రకాశముగా) బాలకులారా! ఇంత లేప్రాయమునందే యీశౌర్య
విక్రమ మెట్లలవడినది. మీతల్లిదండ్రులెవరు?

లవు—రాజా! మాతోడ నీవేమైన సంబంధ బాంధవ్యము కలుపుకొనం
దువా! కిదనాసక్తినినున్న మాక్షేపసక్తియేల?

శ్రీరా—బాలకులారా మీరు యుక్తమనుమాట పలుకయున్నారు.
పోనిండు నాపంపున నొకపని జేయుడు మీరిప్పుడే మీతల్లికడ
కేగి శ్రీరాముని యజ్ఞాశ్వమును బంధింపగా నాతడేవచ్చినాడు
అతనితో బోరవచ్చునా లేదా యని యడిగిరండు.

లవు—సమర మొనర్చి విజయు లక్ష్మీలాలితులము గాకుండ బోయితిమేని
మాతల్లిమాముఖంబుల జూడదు రాజేంద్రా! ఈవట్టిమాటలతో
నేమిపని! నీవు రాజువు మేమురణభిక్షనడుగుచున్నాము పెట్టుము.
యాచకజనచకోరచంద్రుడవుకదా! సంశయించెద వేల లెమ్ము.

శ్రీరా—బాలకులారా! మీరుపట్టిన పట్టువిడువరా!

లవు—అట్లుజేసినచో జగము మమ్మతినీచ దృష్టితోఁజూడదా!

కుశ—కీర్తికన్యా సమాశ్లేష సౌఖ్యముగోరి మేము కదనంబునదిగితిమి.
హరిహర బ్రహ్మాదులు వచ్చినను నింక వెనుదీయము.

శ్రీరా—నా వీరచరిత్రము మీరెఱుంగక యీ తెఱంగునఁ బలుకుచున్నా
రని తలంచెదను.

లవు—నీచరిత్రమే మెఱుంగ కేమి! గుమ్మజూడ లేదను మాటయేగాని
తక్కిన విషయములన్నియుఁ జూచినాము- నీకల్యాణవైభవము

గన్నులార దిలకించు భాగ్యమునందుటయేగాక బెంగ్లిభోజనము చేసినాము. నీమీాద భక్తినిలుపుటయేగాక జనకాజ్ఞ బాలింపనడవి కరుగు నీవెంట నంటివచ్చినాము.నీసతీ వియోగంబు జూచుటేగాక, హృదయములు పగులనేడ్చినాము-కపులతో జెల్మివాటించుటే గాక సేతువుగూడ గట్టినాము-సముద్రము దాటినాము- లంకలో జొచ్చినాము. రక్కసులతోఁ బోరాటఁ జూచినాము-రావణవధ గాంచినాము-సీతపాతివ్రత్య పరీక్షకు సంతోషమందినాము ఇక నేమికావలయును.

శ్రీరా—మీామాట లద్భుతముగనున్నవి - మిమ్ములను నేనెన్నడును జూడలేదే!

లవు—మమ్ములను నీవు జూడకపోవచ్చును. నిమ్ములను మేము చూచితిమి.

శ్రీరా—ఎచ్చట!

కుశు—కావ్యమున

శ్రీరా—ఇదియంతయు కావ్యమునా! (తనలో) ఏమి! వీరి చమత్కారవచనములు- ఒక్కసారి ముద్దుపెట్టుకొందునా!

శ్రీరా—ఆకావ్య మెవ్వరువ్రాసిరి.

లవు—వాల్మీకులవారు.

శ్రీరా—వారుమీాకు గురువులా

లవు —అవును

శ్రీరా—(తనలో) హృదయమా! తొందపడకుము-నీకు జిత్తమున శాంతికలుగు దినములు సమీాపించినవేమో! ఏమైనను సత్యాసత్య నిర్ధారణఁజేసికొనుము- (ప్రకాశముగా) బాలకులారా! ఇదియంతయుఁ దెలిసియుండియేనా యింత సాహసంబునకుఁ గడంగుచుంటిరి-ధరాభారని వారణార్థ మవతరణ మొదలగునవి యెల్లనెఱింగి భయమందరేల!

లవు—రామచంద్రా! మాచిత్తమున నీవు భీతిఁబ్రశపెట్టఁజాలవు,

మ॥ ధరణీభారని వారణంబునకు దై • త్యశ్రేణిని గూల్ప భా
స్కర వంశంబున జన్మమందిన రమా • కాంతుండవౌ నిన్ను సం
గరమందున్ గెలువంగఁగల్గినఁ ద్రిలో • కఖ్యాతిచే మూరు, నీ
కరమందున్ దెగినన్ లభించుఁగద మో • క్షశ్రీసమాశ్లేష మో
హా! సందేహము బొందకుండినిక నయస్త్రంబు సంధింపవే.

కుశు—

చ॥ జగములకెల్లఁ దండ్రివట • సత్యముమాకును తండ్రివౌదువో
నిగమవిచార! నీలగళ • నీరజసంభవసన్నుతా! నినున్
దగరణమందు దాకి సమ • దగ్రబలంబున గెల్వఁగొన్నచో
జగమునంగీర్తిగాంతు, మది • సాగకనీదు శరాళిచేతనే
దెగిపడినన్ సుఖించెదము • దివ్యపదంబును జేరిరాఘవా.

శ్రీరా—బాలకులారా మీరుమంచిచెడ్డలు యెంచుటలేదు ముందువె
నుకలు చూచుటలేదు కార్యముమిగిలినపిదప నాలోచించినందువ
లన ప్రయోజనములేదు పదునాల్గుభువనంబులయందును నీశ్రీరా
మునినెదిరించి బ్రతుకువాడులేడు ఇటువినుము.

సీ॥ శివధనుర్భంగంబు • క్షితినాయకులుసిగ్గు
నందగావిరచుట • నరయలేదె

కుశు—పాత్రిత్వవిప్రాగ్ర్యకోటి • వంచినృపులముందు
బలశాలిననిపల్క • భావ్యమగునె

శ్రీరా—చిఱుతకూకటునాడు • శితశస్త్రమున దాట
కినిగూలనేయుట • వినఁగలేదె

లవు—స్త్రీవధఁగావించి • చేసితిఘనకార్య
మనియిట్లువచియింప • నర్హమగునె

శ్రీరా—క్షాత్రకాంతారంబు • ఖడించుభూసురు
నలఘుశక్తినిగెల్చు • టరయలేదె

లవు—వాణియందుబలంబు • వరలుభూసురుగెల్చు
కార్యంబుగొప్పగా • గాంచనగునె

శ్రీరా—రాష్ట్రాపరాధుని • రాధునివనిలోన
దున్మాడినబలంబు • దోచలేదె

కుశు—చదువంగలేనట్టి • నాతినిజంకలో
బెట్టుకొనినవాని • గొట్టనగునె

శ్రీరా—వాలినినొకకోల • గూలగానేసిన
విక్రమంబైనను • వినగలేదె

లవు—చెట్టుచాటుననిల్చి • సిగ్గెల్లవిడనాడి
బడగనేసినమాట • నుడువదగునె

శ్రీరా—పౌలసుదిండులతేని • బుడమిపైవధియించి
సురులనునేలుట • చూడలేదె

లవు—తమ్మునిచేతమ • ర్మమ్ములుగ్రహించి
దనుజేంద్రుగూల్చుట • ధర్మమగునె

శ్రీరా—తే॥ గీ॥ ఇట్టిఘనకార్యముల్ జేసి • యెనగునన్ను
బవరమునదాకమీరలే • పాటివారు

లవు— ఇట్టిఘనకార్యముల్ జేసి • యెసగనిన్ను
బపరమునదాకు టేమాకు • భవ్యకీర్తి.

శ్రీరా—కుమారులారా! గుఱ్ఱమునువిడువరా!

లవు—విడువము.

కుశు—ఏమయ్యా! యుద్ధముసేయ జాలకయిట్లుపలుకుచునుంటివాయేమి

శ్రీరా—ఇకమీయెడల గరుణవహింపరాదు ఇదిగో! అస్త్రము విడుచుచున్నాను (అస్త్రము విడువగానయ్యవి పూలహారములై లవకుశులగళంబుల నలంకరించును.)

శ్రీరా—(తనలో) ఏమిది! ఆశ్చర్యము మదీయోగ్రశరములు వీరికిబువ్వహారంబులైనవి వీరియొద్దనెట్టిమహిమకలదోకదా! కానిమ్ము బాలకులారా ఇదిగో! ఈయస్త్రమునకుప్రతిలేదు ఇక దీనినివిడిచెదను (నారాయణాస్త్రమునుతొడుగును)

లవు—(రహస్యముగ) అన్నయ్యా? ఈతని తేజము నాకొక్కింత వెరపుగల్గించుచున్నది,

కుశు—నీవుభయమందకుము అమ్మకృవమనలనురక్షించును. (అస్త్రిము నుతొడగి)

తే॥ గీ॥ జననిజానకితోకైక • సాధ్వియేని
యామెహృదయంబునిర్మల • మైనదేని
రమ్యకీర్తికన్యకయామె • ద్రవ్యమేని
మూర్ఛలోమున్గుగాతనీ • భూమిదవుడు

శ్రీరా...హా! జానకీ! జానకీ! (మూర్ఛంబోవును)

((ప్రవేశముతోందరతో ఆంజనేయుడుప్రవేశించును.)

ఆంజ...(లవకుశులనుజూచి) ఓహో! బాలకులారా మీరేనా మాప్రభుం షు-మాదేవుడు-మాతండ్రి అగుశ్రీరామచంద్రునియెడల నిట్టి మహాపరాధము జేసినారు-ఇక మిమ్ము బ్రతుకనియ్యను నన్నెవ్వనిగా భావించితిరో శతయోజనంబైన జలరాసి గోష్పదంబుగ నెవ్వడు దాటెనో,లంకాపురద్వారరక్షణి యగులంకిణి గర్వమెవ్వడుతూలించెనో, అక్షీణబలుడైన నక్షయుని సంహరక్షితినివ్వడుగూల్చెనో, లంకాపురంబెల్ల ఘోరాగ్నిజ్వాలలతో నెవ్వడునుంచివేసెనో, శ్రీరాముని పాదసేవకుండయి యెవ్వ డువిలసిల్లెనో, అట్టిఆంజనేయునిగా నన్నెఱుంగుము ఇదిగో నాప్రతాపముజూడుము. (వాలముద్రిప్పుచున్నాడు)

లవు...అన్నయ్యా! వీడుమహామహిమగలవాడని మనముచదివినాము

కుశు...ఇదిగో వీనినిసమ్మోహన రావహాస్త్రముచే బంధింతము

(అనిశరముప్రయోగించి యిరువురును పోవుచుండఁగా ఆంజనేయుడువారివెంటబోవును)

అవనికపడును.

(సీతయు - పర్ణశాల - గూర్చుండును.

సీత—(తనలో) యుద్ధమున కరిగిన నాకుమారులింకను రాలేదేమి కారణమో! అక్కటా! వీరికేయపాయమైన వాడమియుండదు కదా!

వాల్మీకి—(ప్రవేశించి) అమ్మా! విచారించుచున్నావేమి!

సీత—తండ్రీ! కుమారుల రాకనుగూర్చి.

వాల్మీ—వారింగూర్చి యాబెంగ-నీకట్టిది వలదు, విజయలక్ష్మీలాలితులై యిప్పుడే యరుదేరఁగలరు. వారినిజూచి నీవానందింపఁగలవు.

సీత—తండ్రీ! నాకు శుభదినములు సమీపించుచున్నవని వక్కాణించితివే! ఈజన్మమున నేను త్రిలోకారాధ్యుఁడగు రామచంద్రమూర్తి దివ్యమంగళ స్వరూపమును జూడఁగలనా!

వాల్మీ—అమ్మా! నేడో రేపటనో చూడగలవు. నావచనంబులు విశ్వసింపుము. నన్నుజూచుటకెవ్వరో తాపసివచ్చినాడు. అతనితో మాట్లాడి యిప్పుడే వచ్చెదను. (నిష్క్రమించును.)

(లవకుశులు - ప్రవేశింతురు.)

లవ
కుశు } తల్లీ! నమస్కారములు.

సీత—ఇష్టార్థ సిద్ధిరస్తు. తండ్రులారా! జయలక్ష్మి మిమ్మేవరించెనుకదా!

లవు—లోకైక సాధ్వివగు నీయాశీర్వచనము మఱియొక తెఱగున నగునా!

సీత—మీతోఁబోరిన క్షత్రియులెట్టి పరాక్రమవంతులో కదా!

కుశు—లోకాతీతపరాక్రమోపేతులని చెప్పుటకు సందియము లేదు. చివరకు మాతోఁ గయ్యము సేయవచ్చిన మహానుభావుడు సాక్షాద్భగవత్స్వరూపుఁడే. ఆతనింజూచిన మాకది యొకవిధమగు భక్త్యనురాగ ముదయించినవి. మొదట నతడు బాణములను మాపైఁ బ్రయోగించినాడు. అవి పూలహారములై మాగళంబుల నలంకరించినవి. మరల నారాయణాస్త్రమును దొడిగినాడు. మేము నీపేరుచ్చరించి బాణమును దొడిగితిమి. అమ్మా! ఏమి చెప్పుదును. నీనామస్మరణము మేము చేసినంతనే యాతడు మూర్ఛిల్లినాడు. ఆతని వ్రేలినున్న యుంగరమును మేము తెచ్చినాము. (ఉంగరమిచ్చును.)

సీత—(ఉంగరముచూచి) హా! రామా! రామా. (మూర్ఛిల్లును)

కుశు—తల్లీ! ఇదియేమి.

లవు—అమ్మా! ఇట్లు బడితివేమి?

సీత—(లేచి) తండ్రులారా! ఎంత పనిజేసితిరి. ఆ రాముని-పరంధాముని-నట్లు జేసితిరా!

ఉ॥ హా రఘువంశ వార్ధి శశి • హా! మునివందిత! హా శ్రితావనా
హా! రమణీయతేజ! సక • లామర సన్నుత పాదపద్మ వి
స్తార యశోభిరామ! ఖర ! దైత్యవిరామ! జనాభిరామ! నీ
వా! రణమందునా కరణి • నైతివె పుత్రులచేత నక్కటా.

లవు—రామునిగూర్చి చింతించెదవేల?

సీత—అయ్యో! నాయనా! చింతకాదా!

తే॥ గీ॥ రమ్యగుణధాము, దైత్యవి • రాము సూర్య
వంశవిమల జలధిసోము • భవవిరాము
మానిజనకాము, శ్రీరాము • మదినిమీరు
జనకుగా జూడరైతిరి • తనయులార

అతఁడే మీతండ్రి.

కుశు—అక్కటా! మేమెంత పాపము కట్టుకొంటిమి. పితృహంతకుల మైతిమే.

లవు—అప్పుడప్పుడు మాతండ్రిని జూపింపుమని నిన్నడుగుచుందుమే వారమా. అయ్యో! ఇప్పుడెదుటకువచ్చిన తండ్రిని నిట్లు జేసితిమి. కుశలవులు తండ్రిలేనివారగుదురా! అన్నయ్యా! మనమా కోతిని విడిచివేయుదమా.

సీత—కోతియేమి?

లవు—ఎవరో ఆంజనేయుఁడట. సమ్మోహన రామాస్త్రమున బంధించి తెచ్చితిమి.

సీత—అయ్యయ్యో! ఇదియేమిదారుణము. ఆమహానీయుడు మీతండ్రికి గడుగూర్చుభక్తుడు. ఇటుదోడ్కొనిరండు.

లవు—(నిష్క్రమించి వెంటనే హనుమంతునితో ప్రవేశించును)

అంజ—(సీతనుజూచి సంతోషముతో) అహా! మాతా - భూజాతా - సీత, తల్లీ! సేవకుడు నమస్కరించుచున్నాడు.

సీత—(విచారముతో) వత్సా! మారుతీ! రాముని కెట్టియపాయమొదవెనో కంటివా! కన్నకుమారులే తండ్రినిట్లు జేసిరి.

ఆంజ—రఘుకులవర్ధనులావీరు వీరు నాచిన్నదైవములా! అమ్మా! నేడు నాజన్మపావనత్వము గాంచినది.

సీత—నాయనా! పవమానసూతీ! నాదైవమునకు, నాభాగ్యరాసికి, నాతపఃఫలమునకు, నాజీవధనమునకు అయ్యోయిట్టిస్థితిసంభవించునా! సంసారసముద్రతరణంబులు - ఘోరదురితసంహారణంబులు - సన్నుతసకలమునిజనామరగణంబులు - భక్తజనహృదయపీఠికాభరణంబులు - నగు శ్రీరామచంద్రుని దివ్యచరణంబులనా కు జూపుమా? నాపరితాపమునార్పుమా? ఇంతకుమున్ను నాకై నీ వెంతయో శ్రమంబునందితివి. రఘుకుల క్షేమము నిరంతరము జూచువాడవు. సుగ్రీవుని మా రామమూర్తికి సఖునిగాజేసినావు వార్ధిలంఘించిలంకకువచ్చి ప్రాణేశ్వరుని సేమము నాకు దెలిపి నాప్రాణముల రక్షించినావు. సంగరమున రావణునిశక్తిచే మూర్ఛనందిన సౌమిత్రిని సంజీవిందెచ్చిరక్షించినావు. నీయద్వితీయ భక్తిచే రాముని మెప్పించినావు ఆదేవదేవుని ఆజగదారాధ్యుని నాకు నేడు జూపుమా?

లవు—తే॥ గీ॥ తండ్రిక్రతుహయంబును బట్టి • దైర్యమునను
బంధుజనముల గూల్చిన • పాపులనుచు
జగము నిందింపకుండెడి • సరణిజూచి
మమ్ముమనుపుమా కృపను జూపి • మానినాథా.

కుశు—తే॥ గీ॥ బాల్యమున హహసించి య • శ్వమును బట్టి
తండ్రులకు నెగ్గొనర్చిన • ధర్మహీను
లంచుభావించి మమ్ము గో • పించకుండ
నంచితప్రేమజూడుమా • యమలచరితా

(ప్రవేశము:—వాల్మీకి- జనకుడు

వాల్మీ—కుమారులారా? భయమందవలదు. (సీతంజూచి) సీతా! విచారమందవలదు. రణంబున శ్రీరామునకెట్టియపాయమును సంభవించియుండలేదు. నీపుత్రులొనర్చిన నీనామస్మరణమున శ్రీరామచంద్రుడు పరితాపమున నొడలుదెలియకయున్నాడు. అది కేవలముపరితాపముకాదు. నీయందలి యనురాగరసాధిదేవతయు, బుత్రులయందలి ప్రేమరసాధిదేవతయు, నాతనినట్లుమూర్ఛిల్లజేసినవి. కుమారసహితముగ నా మహనీయుని దర్శించెదవుగాక! రమ్మ.

జన —కుమారీ ! నీకష్టములు గట్టెక్కినవి రమ్మ.

వాల్మీ—(ఆంజనేయునిజూచి) ఇదిగో! మారుతి కుమారులారా రండు.

(అందరు నిష్క్రమింతురు)

రంగము:—(యుద్ధభూమి:—శ్రీరాముడు మూర్ఛిల్లి యుండును-ప్రక్కజనకుడాసీనుడై యుండును-వాల్మీకి-యభిమంత్రించును)

శ్రీ—(లేచి) తాపసోత్తమా! ప్రాచేతసా! ఈసమయమున మీదర్శన భాగ్యమునాకు లభించినదే- మారసమానసుందరాకారులగు నా కుమారులు- రామమయజీవితయగు ప్రాణేశ్వరి-జానకి-మునీంద్రా! కరుణించిచూపుము. (అను-30)

(లవకుశులు- పాడుచు ప్రవేశింతురు)

శ్రీరా—హా! కుమారులారా! మీయెడల నేను మహాపరాధమును జేసినాను. నేనుమహాక్రూరాత్ముడను. అనురాగ రహితుడను. నామోముమీరుచూడరాదు. (జనకునిజూచి) మామా! జనక రాజర్షి! ఈపరమపాతకుని నల్లునిగా నేలగొంటివి. సీతనూజకట్టి కడగండ్ల గల్పించిన యీకిరాతుని నీతపోబలంబున. భస్మము నేయక నిలిపితివేల.

జన—రామా! జగదభిరాముండవగు నీవట్లుబలికిన నేమందును. నీవు శ్రీమన్నారాయణాంశ సంభూతుడవు నాకల్లుడవగుటజేసి నేను తరించితిని.

(ఆంజనేయుఁడు శూర్పణఖాకరాళులతోఁ బ్రవేశించును)

ఆంజ—రామా! మదీయహృదయకమలనిలయా! నీపాదములకు నమస్కరించుచున్నాను.

శ్రీరా—మారుతీ! ఈదుష్టనాతిని నీవెట్లు తెలిసికొంటివి.

(ప్రవేశము సీత పాడుచు)

శ్రీరా—ప్రాణేశ్వరీ! నిర్మలజనకవంశవర్ధనీ! భవదీయ సౌశీల్యాదిగుణములనెఱింగియుండియు గరుణవిడిచి కఠినచిత్తుఁడనై యట్లడవులకంపిన యీకిరాతుని మన్నింపుము. (అనుబంధము 31)

సీత—దేవా! నీవట్లనుడువవలదు. విధికృతము నెవ్వరును దప్పింపఁజాలరు. నేనెచ్చటనుండినను నీనామస్మరణమే నాకుదిక్కగును.

ఆంజ—దేవా! వీరిరువురును శూర్పణఖాకరాళులు. రజకవేషములచే మోసపుచ్చి యింతపని గావించిరి.

వాల్మీ—కారణాంతరములచే నిట్లయినది. గతజలసేతుబంధనమేల! రామా! నందనుల నీక్షించితివి. సాధ్వియగు సీతయానీసేవకై వచ్చినది,

జన—(వాల్మీకిం జూచి) సీతారాములను గుమారసహితముగ మీకరుణవలనఁ జూచుటచే నేను సంతోషసాగరమున మునిగినాను. మీయెదుట నామనుమలకు యౌవరాజ్యాభిషేకము జరుపవలయునని కోరుచున్నాను.

శ్రీరా—ఇట్టి సమయమున నాసోదరులు———

వాల్మీ—రామా! వారింతకుమున్నే మూర్ఛనుండి లేచియున్నారు.

శ్రీరామ—మారుతీ! ఈశూర్పణఖాకరాళులు నిశ్చయముగా దండింపఁబడవలసినవారే, కానిశుభసమయమున నట్టి దుష్కార్యమునకు గడంగవలదు. విడిచిపెట్టుము.

(ఆంజనేయుడట్లు జేయును

(లవకుశకుమారులను గూర్చుండఁబెట్టి పట్టాభిషేకము సేయుదురు.)

అనుబంధము_32.

మంగళము

ఇది షష్ఠాంకము. సర్వము సంపూర్ణము:—

# అనుబంధములు.

అను- (1) సింధుకమాచి- ఏక

రణరంగంబున రాముని వధియించుటయా ॥అహాచాల్చాల్॥ రణ
రణమున మన- దైత్యకులంబెల్లను- మా
రణమగుటది- కనవో- భయమును కనవో ॥రణ

అను- (2) యదుకులకాంభోజి - ఆటతాళము,

శ్రీరా—కాంత చూడుము కాంక్షతీఱగ- సంతసంబిడి
వింతవింతలగొల్పు నీకీవనప్రాంతమూ॥
సీత—వారిజాకర వైభవ బదె యెట్టులున్నదో చూచితే
నీరజాయతలోచనా మనకోర్కెలెల్లను నించుగా
శ్రీరా—మల్లెమొల్లలుగంటివా మదిరంజిలంగసతీ
యెల్లెడన్ భువిరాలియున్నవి యేరుకొందమనీనినిన్
సీత—వలదునీనినినేరగా రఘువంశవార్నిధిచంద్రమా
కలితభూజముక్రింద విశ్రమింపఁగపోదము

అను. (3) కన్నడ- ఏక.

వనములకరుగగ నాకును
మనసయ్యెను- మనువంశ జలధిశశీ ॥వ॥
వనములగల తాపసనిలయముల
గని- మునిసతులను దర్శించెద ॥వ॥

అను. (4) కన్నడ- ఏక

తగునే నీకిటుఁగోరగ- మగువా!
అగునే వనములకరుగ- నగరే- జనములు ॥ త ॥
నిన్నమొన్న నేకదా- వనవాసాయాసము దీరెను
కన్నెవుగావు గర్భిణివి- కాంత... తెలియవె ॥ త ॥

అను. (5) కేదార - రూపక

సీత—కృపగనుమా నాథా - విపినమున కేగా॥ కృ॥
శ్రీరా—తగునే - తరుణీ - కోరరాని కోర్కె యిట్లు॥ త॥
సీత—దే - వా - మ - న్నిం - పు - మా॥ కృ॥
శ్రీరా—కాం - తా - యిం - తా - చిం - తా - యేల॥ త॥
సీత—నా - థా - నా - కో - ర్కె - నా - పా - బా - ల॥ కృ॥
శ్రీరా—విపిన - మెపుడు - చూడ - లేదె - వలదు - వలదు॥ త॥

అను. (6) యదుకుల కాంభోజ - రూప

జానకికీ నిందకలుగునని నే-
మానసమున నెపుడైనను దలచితినే॥ జా॥
మానిని సాధ్వియని - మానుగపలికిన పలుకులు
గానగరాకను - జనులకు - నమృతముగదోచనే॥ జా॥

అను. (7)

మదికరుణబూనకేగతి - సీతన్
మదిరాక్షిన్ - వనులకుబంపగ - దగదో- రఘువర॥మ
సాకీ॥ ఆసీతాకాంత సర్వభువనైక మాతయంచూ
వాసిగా నగ్నిసూత్రుండు చెప్పగానాలించీ
మిత్రము: —తగునె - యిటుల - సేయ - నగరె - జగతి
యగునె - మగువ - యెడల - నింతకఠినము॥ మ॥

అను - 8. దేవగాంధారి

దేవాది - దేవా .. దివ్యప్రభావా -
యాలింపు మనవిన్॥ దే॥
దివ్యమైన నీ పాదసేవయే
యవ్యయానందమని భావించు కాంత॥ దే॥
అందమా - యిది చందమా లోక
నిందకై - కుందరదన విడచుట॥ దే॥

అను - (9) నోటు

పొందు పొందిక నావలకిక తమ్ములార మీరల్॥ పొ॥
అండజయాన కతంబున - నాగతి - నాపై నిందబడెఁ
దంద్రియాజ్ఞను తమ్ములు సల్పకయుండిరి, రా
ముండిక జీవించిన లాభంబుండునె॥ పొం॥

అను (10) హిందుస్తాని జంఝూటి ఏక.

కష్టాత్ముడనై తిని నే - కఠినమతినై తిని
దురితరతుడనై తి
జనని మాజానకిని రామునాజ్ఞ దెల్పుటెట్లు॥ క॥
దేహ మెల్లగాల్చు - నీదుఃఖ మెట్టులోర్తు
నూహింపఁ జాలకున్నవాడనే॥ క॥

అను (11) ముఖారి - ఆది.

శాపమునిడి యికవేగ - జంపగదమ్మా॥ శా॥
పాపమనక నిన్ను - వనభూమికి జేర్చిన పాపినినన్ను॥ శా॥
కఠినచిత్తుడ - కష్టమానసుడ - అనురాగరహితుడ -
కుటిలుడ - క్రూరుఁడ - వంశనాశకుడ॥ శా॥

అను 12 ధన్యాసి

మఱదీ! తెలుపుమా! ఈకరణిగుండె దేల॥ మ॥
పరభామలు మాతలు - పరధనమన గరళముగతి
నరయుచుందువీవు సతతము॥ మ॥
అనృతము లాడవు - అజికి వెన్నిడవు రా
మునిమాటకు దాటవు - జనసుతికి దప్పవు॥ మ॥

అను 14 కాంభోజి.

మాతరో నినువిడచి - నేనెటుబోదునూ॥
భూతలమున - నీసుగుణ ములనెన్న వశమా॥ మా॥
ఖ్యాతిగా నాడులంకలోను - ప్రీతిగన ననలుండు
సీత - లోకైక మాతయనినుడు వలేదా॥ మా॥

అను 15 ముఖారి రూపక

తల్లి నీకు దిక్కెవ్వరే కాననంబులోన - హా॥ త॥
యెల్లకాలమీ యడవి కాపురంబే
బ్రహ్మనీదు నొసట వ్రాసెనే॥ త॥
లోకైక సాధ్వివి - రాము నిల్లాలవు
భీకరావని నెట్లుందు వమ్మ॥ త॥

అను. 16 - కాంభోజి ఆది.

చింతబొందకయ్యె- మఱది-సుగుణోదధీ ॥చి॥
కాలకర్మ గతినిదాట రాదుగాదె జగతి
నెవ్వారికైన ॥చి॥
నీలమేఘశ్యామ సుగుణధామ భవవిరామ
శ్రీరాము దలంచుచు గానలోన గాలమెల్ల వెళ్లదీసెద॥

17 వాల్మీకి

ఇచ్చటికనతిదూరమ్మున నున్నదిమామునిపల్లె
అచ్చటికీవరుదెంచుము చింతమాని తల్లీ॥ ఇ॥
జనకుడొకటి నేనొకటికాదని నీ
మనమునందునెంచి ధైర్యమూని వేగరమ్మా॥ ఇ॥
మునికన్యలెల్లనీకు నాయానతిగొని
యనిశంబువలయు సేవసేతురు॥ ఇ॥

## 18 బేహాగ్

సాకీ... హేరఘుకులక్షీర పాథోరాసిసంపూర్ణచంద్రా
హేరజనీచరమహాటవీదహన ధైర్యగుణసాంద్రా
గీతము— నిరతరమునీచరణకమల సరోరుహముల
గురుతరభక్తిని భజియించెడుతరుణీ గనవా॥ హే॥

## అను 19 కల్యాణి ఏక

మనుకుల రాముని చరితము - మానినివినుమమ్మా మాయమ్మా ॥మ॥
దనుజుల ద్రుంపగ - ధరణిభరమువాప ధరజన్మించిన ఆ ॥మ॥
జనకునియానతిగొని వనితయునను జుడు తనవెంటనురా
ఘనవనముల కరిగి యచట ఖరదూషణులను ద్రుంచిన ॥మ॥
రవిసుత సూతిని గృపనేలి వాలిని నొక కోలనుగూల్చి
యావిధళ కరుణను కపిముఖ్యుని హనుమంతుని నేలిన ॥మ॥

## అను 20 మోహన

తగునాయిదియనుజ తాదృశులీగతినివగవా॥ త॥
జగతిని నీవెఱుగని ధర్మంబులుగలవా॥ త॥
ధరణీనిభరంబును వాపగనీగతి
ఖరకరకులమున జన్మించినశ్రీహరివే కావా॥ త॥

## 21 కల్యాణి రూప

పిఱికితనపుమాటలు బలుకకు సఖుడా॥ పి॥
కలుషశరమ్ములు నారకమందుండగ
తురగముబట్టిన భయమే మొదవు॥ పి॥

22. కాపీ - ఏక.

నను నెదిరింపఁగ గలవా - తులువా పలువా
మనుకుల రాముని హయమిదియని గనవా వినవా ॥న॥
మదమున నీగతి - బలుకఁగ - తగునా - యగునా
సదమల బుద్ధిని - చనుమా - ముదమును గనుమా ॥న॥

అను - 23. నోయి

శత్రు — బాపడవీగతి బలుకఁగ - సాహసమూనెదవె
యోపెదవేమము - రణరంగమునఁ ॥ బా ॥
లవు — మాటలతో బనియేటికి నీగతినీకుఁ
పోటుతనంబును జూపుము యుద్ధమునఁ ॥మా॥
శత్రు — తాపసు లెచ్చట - యుద్ధం బెచ్చట జనుమా
శ్రీపతిఁ గొల్చుచు సుఖములఁ గనుమా ॥ బా ॥
లవు — విల్లు కరంబున దాల్చిన వీరుడవీవే
యుల్లమునన్ భయమొందిన మేలే ॥మా॥

24. పీల్ - ఏక

హాలవా! నను బాసి పోతివా ॥ హా ॥
ఏల భూపాలు యాగహయము బట్టినాడవో ॥హా॥
మిమ్ము జూచు ని - శోకమ్ము మింగియుండ
వమ్ము జేసి నాదుకోర్కెలెల్ల ॥హా॥

అను 25. తోడి

సరగున దెల్పుమి జననీ
ధరనీకెవ్వడు చేసెను యెగ్గిట ॥స॥
దురితరతుండగు వాడెవఁడైనఁ
బరిమార్చెద - వగపార్చెద - ముదముగూర్చెద ॥ స ॥

అను. 26. కల్యాణి

ఇకమదిశోకముగనకమ్మ - మాయమ్మ॥ఇక॥
ప్రకటితశౌర్యాంబుధ - పార్థివుమదమడచెద॥ ఇ॥
నీమదికిదె మోదముగలుగగగ-
నాతమ్ముని దోర్దర్పచ్చెద॥ ఇక॥

27- వసంత. రూప

పసిబాలుని - వెసనేయుటయే
పౌరుషమని తలంచితివా॥ పసి॥
ఆరితేరినవాడవు - అనఘుండవు - శూరుండవు-
నీవిది - ధర్మంబుగ - మదినెంచితివా॥ పసి॥

అను. 28- కల్యాణి

నిలుమా - బాలకా - రణతలమున॥ ని॥
పలువమాటలు - పలుకగనేటికి-
కలితశౌర్యమునిఁక జూపుచు॥ ని॥
పసికూనలు మీరగుటన్ మీపై
శరముల వేయగజాలక - పల్కితినిటులన్॥ ని॥

అను. 29- ముఖారి ఆది

ఎంతవంతగలిగె మాసీతాకాంతకకటా॥ ఎం॥
వింతనిందయామె పైన బడగ - భూ
కాంతుడామె నడవికంపెనట॥ ఎం॥
పరమపావని - భువనమాత మామాత
విపినభూములందు నెట్టులున్నదో॥ ఎం॥

అను- 30. ముఖారి. ఆది.

తప్పుక్షమింపుమయ్యా - మాతండ్రీ- రామా ॥త॥
నీకతు తురగమని తెలియక దు
ర్నీతిని నడచినమా ॥త॥
వేద వేద్యుడవు - శ్రీదయితుడవు
లోకనాథుడవు - మాకుదండ్రివి ॥త॥

31—సాకీ

హే రామా! అఖిల దైత్యవిరామా! సుగుణధామా-శ్రీరామా,
కారుణ్యగుణాసీమా - కల్యాణనామా - మునిజన కామా
మిశ్ర--నీచరణ సేవకును దూరంబై వనములవనటన్
గుందుచునుండిన - నీచెలియన్ నను నేలుము ॥హే॥

32—మంగళహారతి

సారహారతి - గైకోర శ్రీపతీ
ధీర-నందకుమార - దనుజవిదార- సువిచార ॥సా॥
గోపికాలోలా - సందీపిత- సుశీలా
పాపహార - యదుదీప - గతసంతాప - సుకలాప ॥సా॥
పక్షిరాడ్గమనా - సురపక్షపోషణదమనా.
రిక్ష - కమలదళాక్ష - దనుజవిపక్ష - శ్రీవక్ష ॥సా॥
సామగానలోలా - ధరసీతారామరాయపాలా
భీమానుజప్రియకామా - సుగుణస్తోమానుతనామా ॥సా॥